శ్రీ సనాతన గ్రంథమాల

ప్రసూనము [illegible]

# మృత్యుంజయము

[సోక్రటీసు ప్రవచనము]

తపోవంద స్వామి

శ్రీ సనాతన గ్రంథమాల    ప్రసూనము ౨

శుక్ల నామ సం॥ ఆశ్వయుజమాసము

# మృత్యుంజయము

“ హంసలకు మరణ మాసన్నమైనదని తెలియవచ్చినప్పుడు, పూర్వముకంటె బిగ్గఱగా నెలుగెత్తి గానము చేయును. ఏలన అవి తమ స్వామియగు భగవంతుని సన్నిధానమునకు బోవుచుంటిమను నానందముతో నిండిపోవును. ...నేనీ హంసలకు సహచర భక్తుడను; వాని దైవతమునకే నేనును స్వార్పణము చేసికొనియున్నవాడను......ఈ జీవనమును బాసిపోవుటలో నేను పక్షులకంటె హెచ్చుగ దిగులు పడుటలేదు.”

రజత ముద్రాక్షరశాల : తెనాలి.

1929.

వెల 0—3—0

# పీఠిక.

ఈగ్రంథమాల ప్రకటనను ప్రారంభించి రెండు నెల లైనను కాలేదు. అయినను ఆంధ్రసోదరులత్యుత్సాహముతో దీనికి స్వాగతమొసంగుచు, నింతస్వల్ప మూల్యమునకు మిగుల నమూల్యములగు సద్బోధలుగల గ్రంథములు లభింపజేయు చున్నందుకు ధన్యవాదముల గావించుచున్నారు. వారియా దరణ కర్హులమగుటకు మాకొకటేమార్గము కలదు. సకాల మున, చక్కని విషయములతో గూడిన గ్రంథములను, వాగ్దానము ప్రకారము పాఠకుల కందజేయుటయే. అటులనే చేయుదుముగాక!

సంవత్సరమునకు 300 పుటలును, ఒక్కొకసంచికకు 50 పుటలును నిర్ణయించుకొంటిమి. కాని అదిసాధ్యపడునటుల గాన్పించదు. మొదటి ప్రసూనమునందే దాదాపు 70 పుట లున్నవి. ఈరెండవదానిలోను రమారమి అన్నిపుటలుండవలసి వచ్చినది. గ్రంథవిస్తరభీతిచేత, మిగుల చిన్న చిన్న వాక్య ములతో సంభాషణరూపమున నున్న మూలగ్రంథమును ఎంత సంగ్రహపఱచినను, విషయగ్రహణమునకు భంగమురాకుండ నింకను తగ్గించుటకు వీలుపడినదికాదు.

అయినను రాబోవు గ్రంథములందు ఏబదేసి పుటలకు తగ్గకుండనే ప్రకటించుచు, చందా నొక్కరూపాయిగనే నిలుప నిశ్చయించితిమి. ఇక పాఠక. సోదరులగూర్చి మేము చేయు విన్నపమొక్కటిగలదు. ఈ గ్రంథభావములు విస్తారముగ ప్రచారములోనికి వచ్చుటకొఱకు తమతమ బంధుమిత్రాదులను చందాదారులగుటకై ప్రోత్సహింపఁగోరుదుము. అంతకంటెను ముఖ్యముగ నీగ్రంథములకై కొను వారెల్ల తాము వీనిని చదువుటేగాక, సాధ్యమైనంతమందిచేత, స్త్రీలచేతను పురుషుల చేతనుగూడ, చదివింతురు గాకయని కోరుచున్నాము. అటుల చేయువారందఱును మాయుద్యమమును సఫలముచేసి మాకృతజ్ఞకు సదా పాత్రులగుదురు!

తమచందాధనము నింకను చెల్లించియుండనివారు తత్క్షణమే పంపఁబ్రార్థితులు.

ఇట్లు

కందేపు నరసింహము

మేనేజరు.



# మృత్యుంజయము.

'సోక్రటీస'ను వారొక మహాతత్త్వవేత్త. గ్రీసుదేశీయుడు. ఆదేశపు మూఢవిశ్వాసముల ఖండించి, శుద్ధమగు పారమార్థికబోధలను జేయసాగెను. ప్రాచీనమతభంగమగు నుపదేశములగావించు చుండెనను అభియోగము వానిపై మోప, న్యాయాధిపతులు విషమునిచ్చి మరణము పాల్సేయు దండనను విధించిరి. ఆమహాశయుడు విషమునుద్రావి మరణింపనున్న దినమున, తనశిష్యులతోడను, చెరసాలలో దననుచూడవచ్చిన వారితోడను మరణరహస్యముల గూర్చియు, తత్త్వజ్ఞుల పరమావధినిగూర్చియు ముచ్చటించిన విధమును దెలియుదుముగాక. సంభాషణ రూపమున కడుహృద్యముగ నుండును గ్రంథవిస్తరభీతిచేత, సంగ్రహించి వ్రాయుచున్నారము.

సుఖదుఃఖములజంట

సోక్రటీసు (ఉదయమున చెఱసాలలో)పక్కపైనిగూర్చుండి, కాలును ముడుచుకొని దానిని రుద్దుకొనుచు, అచ్చటివారితోనిట్లనెను.—నరులు 'సుఖము' అనిచెప్పునది యెంతచిత్రమైనది! దానికిభిన్నముగాదోచు దుఃఖమునకును దానికిని గల సంబంధము చాలవిచిత్రముగనుండును! అవి రెండును నరునకొకేసారియనుభవమునకు రావు; కాని అవి రెండును భిన్నవిషయములయ్యు, వానికొనలు కలిపి ముడివేయబడినట్లు,నరుడొకదానిని కాంక్షించి దానినిసంపాదించుకొనినప్పుడు, రెండవదానిని

కూడవిధిగా స్వీకరింపవలసినవాడగుచున్నాడు. 'ఈ నవ్యకవి యీవిషయమును గ్రహించియుండిన యెడల, సుఖదుఃఖములు రెండును పోట్లాడుకొనుచుండ భగవంతుడు చూచి, వానికి సఖ్యతగూర్ప ప్రయత్నించెననియు, సఖ్యతపొసగకుండుటచేత విసిగి, తోకలనుకలిపి ముడివేసి విడిచెనననియు, ఆకారణముచేత వానిలో నొకటినను నికడకువచ్చునపుడు రెండవది కూడ తప్పకవచ్చుచుండుననియు; ఒకకట్టుకథనల్లి వ్రాసియుండెడివాడు. నాస్థితిఅట్లున్నది. సంకెళ్లు వేసియుంటచేత నాకాలికి నొప్పికలిగియుండెను; ఇప్పుడో (కాళ్లువిడుదలైనటచేత) నానొప్పికి వెనువెంటనే సుఖమువచ్చినట్లు కాన్పించుచున్నది.

మరణసమయమున కవనము.

అచ్చటివారొకరు, సోక్రటీసది వరకెన్నడును కవనము చేసినవాడుగాక, చెఱసాలలో మరణదండన విధింపబడియున్న సమయమున, కవిత్వముచెప్పుటకు కారణమేమని 'ఎవెనసు' అను నతడుశంకించుచున్నాడని తెలిపిరి.

సోక్రటీసిట్లనెను: అటులైనచో వానికీయథార్థమును తెలుపుము. (ఎవెనసు గొప్పకవిగదా!) వానితోగాని, వాని రచనలతోగాని నేనుపోటిరాగోరియటుల చేయలేదనుము. అపని సులభమైనదికాదని నే నెఱుగుదును. నాకు గలిగిన కొన్ని స్వప్నములభావమేమై యుండునాయని పరీక్షించుచున్నాను. ఈరీతిగా గానముచేయుమని అవినన్ను ప్రేరేపించుచున్నటుల నా యంతరాత్మకు గల్గిన స్ఫురణను అనుసరించుచున్నాను.

యథార్థమిది. నాగతజీవితావస్థ లందొకే స్వప్నము చాల సార్లు వచ్చుచుండెను. అది వేర్వేఱు రూపములుగా వచ్చు చుండెను. కాని యెల్లప్పుడును "సోక్రిటీసు ! గానమునకై ప్రయత్నించుము, గాన రచనగావింపుము" అనియే చెప్పుచుం డెను. పందెములలో పరుగులెత్తువారిని ప్రేక్షకులు హెచ్చరిం పుచు ప్రోత్సాహము చేయుచుండుతీరున, నాజీవితములో నేను పూనియున్న పనిలో నన్నికల హెచ్చరింపుచు ప్రోత్సహింపు చుండెనని ఇంతకుపూర్వమును తలంచుచుంటిని. నే నిదివరకు దేనినిపూని పాటుబడుచుంటినో, అట్టి గానమునే రచింపుమని ఆస్వప్నము పురికొల్పుచున్న ట్లూహకలిగినది. ఏలయన తత్వ విచారణ అత్యుత్తమగానమని నాభావము. మఱియు నాజీవిత మును తత్వవిచారణయందు గడిపితిని. కాని యీ అభియోగ విచారణము తరువాత దేవుని తిరుణాళ్ళ మూలమున నా మ రణ మాలస్యముకాగా, "ఒకవేళ నాస్వప్నము, సామాన్య ముగానందఱు ననుకొనుగానమునేరచింపుమనినన్ను కోరుచుండె నేమొ, అటులైనయెడల నే నటులనే చేయవలయును. అవిధే యుడ కాదగదు" అని తోచినది. నేను తనువువిడిచి పోవు లోపల, నాస్వప్నాదేశమున కనుసరణముగా కవిత్వరచనచేసి యంతరాత్మను తృప్తిపరచుకొనుట శ్రేయమని తలచితిని. కాబట్టి యిప్పుడు తిరుణాళ్లు జరుగుచున్న దేవతపేర నొక స్తోత్రమును మొదటగా రచించితిని. ఆపిమ్మట 'ఈసపు' కవి కట్టు కథలలో నేనెఱిగినవి, నాచేతికి సిద్ధముగా దొఱికినవి, అనగా

మొట్టమొదటగా స్ఫురించినవి తీసికొని కవనముల్లితిని. ఏల యందురా కవిగాగోరువాడు కల్పనాంశములనే యుపయోగించవలెనుగాని; కేవలము యథార్థమును పద్దెములలో బెట్టదగదని నాయభిప్రాయము. నాకేమో కల్పనచేతకాదు.

మృత్యువునకు స్వాగతము.

ఎవెనసుకవికి ఈసంగతిని దెలిపి, వానిని వీడ్కొంటినని చెప్పుము. తాను బుద్ధిమంతుడేని, సాధ్యమైనంత త్వరలో నన్ననుసరించి రమ్మని చెప్పుము. నేనీదినమున వెడలిపోవలసినట్లున్నది.దండనాధికారుల నిర్ణయమది!"

సిమియసనునతడు "సోక్రటీసూ! ఎవెనసునకు చిత్రమగు సలహా నొసగుచున్నాడవు! నే నాయనను చాలసార్లు కలిసికొనినాడను. ఆయన విషయము నేను గ్రహించినంత మట్టుకు, నీసలహా నెంతమాత్రమును నంగీకరించువాడు కాడనుట స్పష్టము"అనెను.

సోక్రిటీసు"ఏమిటీ! ఎవెనసు తత్వవేత్త.కావున మరణము నిచ్ఛగించును. ఆత్మవిద్యలో పాల్గొనుట కేమాత్రమైన అర్హతగల ప్రతినరుడును అటులనే కోరును. కాని యటువంటి వాడు చేతులార హింసించుకొనడు. అది మరల దోషమట! నీవును, సిమియసును ఫైలోలాసునొద్ద నున్నవారుగదా! వానివలన ఈసంగతులను వినలేదా?" అనగా వారట్టిది దేనిని స్పష్టముగ వినలేదనిరి. అంతట సోక్రటీసిటుల చెప్పసాగెను.

"మంచిది, నేను కర్ణాకర్ణిగ విన్నదానిగూర్చి చెప్పెదను. నేను వినినదానినేని మీకు చెప్పవలదను కారణ ముండదుగదా! చూడుడు, నే నుత్తరలోకమునకు పయనమైపోవు నీ సమయమున, నా ప్రయాణమునుగూర్చి ప్రసంగించుటయు, దాని స్వభావమునుగూర్చి నా యూహాల దెల్పుటయును మించి నాకింక నన్యతర కార్యమేమి యుండగలదు! ఇప్పటి నుండి సూర్యాస్తమయమువఱకు నింతకుమంచిన మంచిపని యేముండును? మీ రుత్సాహముతో వినుడు. బహుశః మీ రేదో యొకప్పుడిట్టిది విననే విందురు. మానవజాతిని శాసించు మతే యితర ధర్మముకంటెను, ఈధర్మము సనాతనమును, అనుల్లంఘనీయమునని నే ననుచో నెఱగుపడుదురు కాబోలు! కొన్ని సందర్భములందు, కొందఱివిషయమునమాత్రము, జీవించియుంటకంటె మరణించుట మేలు అనలేము. మృత్యువెవరికి శ్రేయస్కరమో ఆపురుషులు సయితము తమకు దాముగ ఏమియు ప్రయోగము చేసికొనరాదు సుడీ. అన్యులగు నుపకారులకై వేచియుండవలసినదే! ఇట్లనుచో నామాటలబ్బురముగ దోచవచ్చును. దానికి కారణమును తెలిపెదను.

ఆత్మహత్య దోషమే!

శాస్త్రముల అంతరార్థ మిటులుండును. నరుడొకవిధమగు చెఱయందున్నాడు. తన కైతాను విడివడి పోరాదు; పారిపోదగదు. ఇది బహు గంభీరమైన విషయము! సులభ

ముగ మనస్సున బట్టదు. దేవతలు మన రక్షకులనుటయు, నరుల మగు మనము వారిసొత్తులలో చేరినవారమనుటయు సత్యమని నానిశ్చితాభిప్రాయమైయున్నది. సరే, నీసొత్తగు నొక జీవి, నీవుచావుమని కోరకున్నను, దనను దాను చంపుకొనఁ జూచునెడల నీకు దానిపై కోపమురాదా? దండన కవకాశ మున్నచో నీవు దానిని దండింతువుగదా! అదేరీతిగ తన ప్రాణమును దాను తీసికొనుటకు ఏమానవునికిని నధికారములేదు. నాకు తటస్థించినటుల దేవత లేదేని యావసరము గల్పించు వఱకును వేచియుండవలసినదే. ఇట్లు నిర్ణయించుట అసంగతము కాదుగదా?"

అంత సీబియాసను నతడిట్లనెను; "నిజము; అది సహజముగ గాన్పించుచున్నది. అయినను తత్వవేదులు మృతిని కోరుకొందురని నీవు చెప్పుచుంటివే? భగవంతుడు మనపోషకుడై మనము వాని సంపదయనుట సత్యమైనచో, మనమాటలు పరస్పర విరుద్ధములుగ లేవా? ప్రభువులలో నెల్ల శ్రేష్ఠతములగు దేవతలు తనను పరిపాలించుచుండగా, వారి సేవనువిడిచి విజ్ఞుడగు నరుడు పారిపోక, తృప్తుడై యుండుననుటయే సమంజసముగదా! దేవతలు తననురక్షించు నప్పటికంటె మిన్నగా, తాను స్వతంత్రుడై జీవించు నప్పుడు, స్వయముగ రక్షించుకొనగలనని యాతడుతలంపబోడు. పిచ్చివాడవడైన అటుల తలంపవచ్చును. తనయజమానుని విడిచిపారిపోవుటే మంచిదనుకొనవచ్చును. యోగ్యుడగు యజమాను కడనుండి

తప్పించుకొనిపోవుట తగదనియు, వీఁగున్నంతకాలము తాను వానియొద్దనేయుండి తీరవలయుననియు గ్రహింపలేని బుద్ధిహీనుడుమాత్రము పారిపోనగును. కానివిజ్ఞానియో,తనకన్న శ్రేష్ఠుడగు నొకనికడ నెల్లకాలము నుండిపోవలయుననియే నిశ్చయముఁగకోరుకొనును. ఇదిసత్యమగునేని "మరణమనిన, విజ్ఞాని దుఃఖించును. పామరుడు సంతసించును!" అని నీవిప్పుడు చెప్పుచున్నదానికి భిన్నముఁగా పర్యవసానము తేలగలదు.

ఇట్లు సిబీసు నొక్కిచెప్పువలుకుల విని సోక్రటీసు సంతసించునటులగాన్పించి, యచటివారివంక దృష్టి నిలిపి "సిబీసు సదా తర్కవిమర్శనము చేయుచుండును. ఒకరుచెప్పుదానిని వెంటనే తృప్తికరమని యొప్పుకొనడు.

### ఉత్తరలోక జీవనము.

మీరారోపించు ఈనేరమునుగూర్చి, నేనొకన్యాయస్థానముం చేయున్నటులదలచి, సమాధానము చెప్పుకొనవలయునని భావించుచున్నారు.సరే కానీఁడు. నా అభియోగవిచారణకాలమున నేను ఆ న్యాయాధిపతుల మ్రోలగావించుకొనినదానికంటె, నెక్కువజయప్రదముగా మీయెదుట ప్రతివాదము చేసికొందునుగాక. వినుఁడు. యోగ్యులును,విజ్ఞులునునే యగు ఇతరదేవతల తోడను, ఇదివరకు మరణించియున్నట్టియు ఈలోకములోనిమానవులకన్న యుత్తములగునట్టియు నరులతోడను జీవింపబోవుచుంటినని నాభావము; అటులకానియెడల, నేనునా

మరణమును గూర్చివిచారపడకపోవుట నేరమేయగును. నేను ఖండితముగా నిశ్చయమనజాలకున్నను, శ్రేష్ఠతరులగు నరులతో జీవింపబోవనుంటినను నావిశ్వాసమునుమీరుగమనింపవలసి యున్నారు. కానియిట్టి విషయములలో నేనెంతఖండితముగా నొక్కి చెప్పగలనో అంత ఖండితముగా చాల నుత్తములగు యజమానులచెంత జీవింపబోవుచుంటినని నొక్కి పలుకుచున్నాను. కాబట్టి మరణమున్న నేనంతగా దుఃఖపడుటలేను. ఇచ్చట మృతినొందువారికి ఇంకొక విధమగు జీవనముకలదని నాకు నిశ్చయమే. ఆజీవనము దుష్టులకుకంటె యోగ్యులగువారికి శ్రేయోదాయక మనుమాట అనుశ్రుతముగ వచ్చుచున్నదే.

## విష ప్రయోగము.

ఇట్లు ప్రసంగము సాగుచుండ 'క్రీటో' యను నతడు "సోక్రటీసు! నీకు విషమునీయ నియమితుడైన మనుష్యుడు నీవు విశేషముగ మాటలాడవలదని హెచ్చరింపుచున్నాడు. మాటలాడుటవలన వేడి హెచ్చునట; కాన విషము సరిగాపని చేయదట. ఉద్రేకమును పొందినవారు రెండుతడవలు మూడు తడవలుకూడ విషమును ద్రావవలసివచ్చుట కలదట." అని పలుక సోక్రటీసిట్లనెను. "వానిమాట నటుండనిమ్ము. అతని పని నతడు చూచుకొనుగాక. అవసరమైనచో రెండుసార్లు గాని మూడు సార్లుగాని నాకు విషము నిచ్చుటకు సిద్ధపడి యుండుమనుము. వానిసంగతిమీకేల?

తత్వవిచారమున నిజముగ జీవితమును గడపినవాడు మర ణింపబోవునపుడు సంతోషించుటకు హేతువుకలదు. మరణానంత రము ఉత్తరలోకమున గొప్పలాభముపొందు నాశయట్టివాని కుండునని నే నభిప్రాయపడుచున్నాను. అందుకు కారణమును, ఇప్పుడు విచారణకర్తలుగా కూర్చున్న మీకునచ్చునటుల వివ రింపబోవుచున్నాను. వినుడు, మృతినొందుటననేమో; ఆమృత్యు తత్వమేమో అనువిషయముయొక్క విమర్శనము నేసత్యతత్వజిజ్ఞా సువు సదాచేయుచుండునని లోకమెఱుగకపోవచ్చును. సతతము మృతియే వానివిచారణాంశమై యుండగా, దానికైయే వేచి యుండు నతడు, తనజీవితకాలమంతయు మృత్యువునకై నిరీక్షిం పుచుండు ఆ నరుడు, అట్టిమృత్యు వాసన్నమైనప్పుడు తహతహ పడుట విపరీతముగ దోపకమానదు. చూడుడు. మృతియనగా దేహమునుండి ఆత్మ విడివడుటయేయని మనము నమ్ముచున్నా ము. మరణమున శరీరము దేహమునుండి విడివడి ఆత్మ వేఱుగా నుండుటయు, ఆత్మనుండి విడివడి దేహము వేఱుగా నుండుటయు నగును. అంతకుమించి మరణమననేమున్నది? ఈవిషయమును చక్కగా గ్రహించుటలో సహకారికాగలదని నాకుతోచు మఱొకవిషయముకలదు. తినుట, త్రాగుట, మొదలగు ఆనంద ములనబడు విషయములను ఘనములుగ తత్వజిజ్ఞాసువులు పాటింతురని మీరు నమ్మవలదు. శారీరకములగునింక నితర విషయములను గూర్చియు నెక్కువగవారు తలపోయుదు రను కొనకుడు. సొగసైనదుస్తులు, అలంకారములు, పాదరక్షలు

సంపాదించుకొనుటకై తత్వదర్శి యారాటపడునా? అత్యావశ్యకమగునంతవఱకుతప్ప వాని నతడుసరకుగొనడు ఇంతేల, వాని విచారణ యంతయు దేహసంబంధమును విడిచియుండునని తెలియుడు. వీలైనంతమట్టుకాతడు దేహమునకు దూరుడై ఆత్మవిచారణచేయుచుండును. తనకుచేతనైనంతవఱకు యితరులకన్న తత్వవేత్తతనయాత్మను శరీరస్మరణమునుండి దూరముచేయుచుండును. భోగవిషయములందు అభిలాషనువిడిచి వానిప్రమేయమును తీసికొననియెడల,నరుని జీవనము వ్యర్థమని లోకులు తలచుట నిజమే. శరీరసౌఖ్యము నుపేక్షించునతడు మరణించిన వానితో సమానమనియే వారుభావింతురు?

శరీరము ప్రతిబంధకము.

సత్యజ్ఞానార్జనము యెటుల జరుగుచున్నదో చూతుము. జ్ఞానముకొఱకై ప్రయత్నించునప్పుడు దేహముయొక్క సహవాసము నంగీకరించితిమేని అదిప్రతిబంధకముగనుండును. నిదర్శనముచూడుడు. ఈదృష్టి, యీశ్రవణము, ప్రజలకుసత్యమునుగోచరింప జేయుచున్నవా? మనము దేనినిగాని నిర్దుష్టముగ చూచుటయు, వినుటయు సంభవము కాదని కవులనేకులు వివరించియేయున్నారు.శరీరమునందలియీజ్ఞానేంద్రియములే దోషరహితములుగను, నిష్కళంకములుగను లేనియెడల తక్కిన వాని విషయముచెప్పనేల? అవియింకను అపరిపక్వములుగదా? ఇకఆత్మసత్యమును గ్రహించునదెప్పుడు? దేహముయొక్క సహ

వాసముతో ఆత్మ దేని విచారణను పెట్టుకొనినను దేహముదా
నిని పెడత్రోవకులాగునని తెలిసికొంటిమి. కావున ఆత్మకు సత్య
ము ప్రత్యక్షము కాగలుగుట జిజ్ఞాసపూర్వముకగ మాత్రమె
సంభవమగును. మఱియు యింద్రియవ్యాపారములేవియు అన
గా చూచుట, వినుట, సుఖదుఃఖముల ననుభవించుట అనునవే
వియు ఆత్మకు అడ్డురానప్పుడే అది బాగుగా విచక్షణ చేయగ
ల్గును. శరీరమును దూరముననుంచి సాధ్యమైనంతవఱకు దానిసాం
గత్యమును, దాని ప్రమేయమును తొలగించుకొని తా నేకాంత
మును అనుభవింప జాలునప్పుడే ఆత్మకు సత్యాన్వేషణము నిజ
ముగ సాధ్యమగును. అనగా తత్వవేత్త యొక్క ఆత్మ శరీరమును
మిక్కిలిగా నిరసించి దానినుండి దూరముగాచని తాను ఏకాం
తముగానుండ జూచునని యర్థము."

ఇంత వఱ కేకీభావ మమరినది. పిమ్మట ప్రసంగము
యీక్రిందిరీతిని సాగినది.

## పరిపూర్ణత.

సోక్ర:—ఈతరువాతి విషయమున నీవేమందువు? పరిపూర్ణ ఋజుత్వమనునది ఒకటి కలదని ఒప్పుకొందువా?

సిమియాసు:—ఒప్పుకొందును.

సోక్ర:—పరిపూర్ణసౌందర్యమో? మఱియు పరిపూర్ణశుభమో?

సిమి:—అవియు కలవని తప్పక యొప్పుకొందును.

సోక్ర:—వానిలో దేనినైన మీకంటితో చూచితిరా?

సిమి:—ఎంతమాత్రమును లేదు.

సోక్ర:—ఏయింద్రియ జ్ఞానమునకుగాని పరిపూర్ణత యెన్నడైన గోచరించినదా? నిరవధికమగుపరిపూర్ణత్వమునుగూర్చి మనము మాట్లాడుచున్నాము. పరిమాణము, ఆరోగ్యము, బలము ఇంతేల? దేనియొక్కగాని మూలతత్వము అనగా దాని కేవలస్వరూపము మనకు గ్రాహ్యమగునా? ఏవిషయము యొక్కగాని పూర్ణసత్యస్వరూపమును శరీరము భావనచేయ జాలదు. ఇంతకంటె ప్రతి విషయము యొక్కయు పూర్ణసత్య స్వరూపమును బుద్ధిచేత గ్రహించుటకై అత్యంత శ్రద్ధాళుడై ప్రయత్నించు నరుడు దానిస్వరూపభావనను సమీపింపగలడనుట యెక్కువ సమంజసముగ కనబడుచున్నది. నరుడు తన బుద్ధితోడమాత్రిచె విషయ విమర్శనను పూనుకొని మఱియు తన భావప్రసరణమున వినియోగపడు విచక్షణాశక్తికి అడ్డుగ దోచుకారణమున, కంటినిగాని మఱేజ్ఞానేంద్రియమునుగాని తోడుదీసికొనక, విడిచిపెసినప్పుడే, సమగ్రమును విరుద్ధమునగు భావసంపదను పొందగల్గుచున్నాడు. అప్పుడతడు నిష్కళంక పూర్ణపురుషుని కేవలము తననిర్మలబుద్ధి పాటవముతోనే అనువర్తించువాడగును. చేతనైనంతవఱకు కన్నును చెవిని ఇంతేల శరీరమునంతటిని అతడు విడిచివేయవలసినదే. శరీరసంసర్గము ఆత్మకు బాధకరమై సత్యమును జ్ఞానమును పడయుటలో ప్రతిబంధకముగనుండును. సత్యపురుషునిలేక ఆత్మయొక్క జ్ఞానమలవడుట యెవ్వనికేని సాధ్యమగుచో అటుల శరీరత్యాగము

చేసినవానికే లభించును. ఉత్తములగు తత్వజ్ఞులు దీని నంతను గ్రహించి ఒకరినొకరు యిట్లు హెచ్చరించుకొనవలసిన వారగుదురు. వివేకమును మార్గదర్శిగాదీసికొని పరమావధిని సురక్షితముగా చేరుటకు మనకుసన్నని త్రోవయొకటున్నటుల చూపట్టుచున్నది.మనకీ శరీరమున్నంతవఱకును ,ఇటువంటిప్రతిబంధకముమనయాత్మల వెంటాడునంతకాలమును మనము గమ్యస్థానమును చేరజాలము. ఏలన తనపోషణనిమిత్తమై యీశరీరము మనకాలమును నిరంతరము హరించుచున్నది. ఇంతేగాక యీశరీరమునకురోగము తటస్థించునేని అవియుసత్యతత్వాన్వేషణముసమనకడ్డము వచ్చును.ఎన్నియో కామములతోడను, కోరికలతోడను,దిగుళ్లతోడను నానావిధములగు భ్రాంతులతోడను మితిలేనిపామరత్వముతోడను యీశరీరము మనను నింపివేయుచున్నది. శరీరము ప్రతిబంధకముగానుండుటచేతనరునకు భావనయేసాగదను ఆర్యవచనము కలదు. శరీరమును దాని కోరికలును యెన్నియో యుద్ధములకును,యెన్నియో విభేదములకును, మఱియు నెన్నియో కీచులాటలకును మూలములగుచు నుండును. ధనార్జనమె పోరాటములకన్నిటికిని మూలకారణమగుచున్నది. ఈశరీరావసరములు దీర్చవలసిన వానిసలమై జీవించుటచేత ధనార్జనము చేయక తప్పుటలేదు. కాబట్టి యిన్ని హేతువులచేతమనకు తత్వవిచార మావకాశమే లేకుండబోవుచున్నది. తుదకెట్లులో కొంచెము నేవు శరీరస్మర

ణను తప్పించుకొని యేదేని విషయమును పరిశీలనముచేయ
పూనుకొంటిమా, మన విచారణయందలి ప్రత్యంశమునకు
దాని సంగతియే మనకేమరైవచ్చుచు, సత్యము గోచరింపకుం
డు చీకాకుపఱచును; మఱియు బాధలను కల్పించును; దిగుళ్ళను
పుట్టించును. దానిమూలమున మనము తత్వదర్శనమును చేయ
జాలకున్నాము. మనకు నిష్కళంకమైన జ్ఞానము కావలయు
నన్నచో శరీరమునుండి విడుదలను పొందకతీరదు. ఆత్మ తనకు
దానై నిలుచునప్పుడే విషయముల సత్యస్వరూపము గోచ
రము కాగలుగును. దీనినిబట్టిజూడ మన మభిలషించు జ్ఞాన
మును మరణాంతరము పొందగలుగుదుమని తోచుచున్నది.
అట్టిజ్ఞానముకొఱకై మనము తీవ్రముగ వాంఛించుచున్నా మం
దుము గదా! దీనినిబట్టి బ్రతికియుండగా ఆ జ్ఞానము లభింపజాల
నట్లు తోచుచున్నది. శరీరముండగా మనకు నిశ్శేష జ్ఞానము
లభ్యముకానియెడల, క్రింది రెండు విషయములలో నొకటి
సత్యము కావలసివచ్చును. 1 మనమాజ్ఞానమును పొందనేలేక
పోవలయును. 2 లేదా మరణానంతరము మాత్రమే మన మా
జ్ఞానమును పొందవలసియుండును. ఏలయన అప్పుడేగదా శరీ
రమునుండి వేఱై ఆత్మ యేకాంతముగా నుండజాలును? అంత
వఱకును వీలుండదుగదా! ఇక మనము బ్రతికియుండగను సయి
తము శరీరముతోడి సంబంధమును సహవాసమును అత్యంతా
వసరమగు నంతవఱకు మించి పెట్టుకొనక దేహస్వభావముచేత
కళంకితులముగాక మెలగు నెడల మనము జ్ఞానమునకు సమీ

పముగా పోవచ్చును. భగవంతుడు శరీరమునుండి మనలను విడి పించు నంతవఱకును దానిచేత మలినులము కాకుండమాత్రము జీవింపవలయును.ఆటుల నిర్మలురమైయుండి శరీర దోషములకు లోబడక జీవించితిమేని, మనవలెనే పరిశుద్ధులగువారి సహవా సముచేయుచు పరమపవిత్ర విషయములను గ్రహించుచుండ గల్గుదుమని నాకు తోచుచున్నది. అపవిత్రులు పవిత్రమగు తత్వ జ్ఞానముసుపొంద నర్హులు కారుగదా! సత్యజ్ఞానాన్వేషణపరుల ప్రసంగములును, విచారణలును యీరీతిగ నడుచునని నాయభి ప్రాయము. ఇది నిజమే యైనయెడల నేను పోనున్న స్థలమును చేరినప్పుడు మాత్రమే నాకు సత్యజ్ఞానము లభింపగలదు. ఎక్కడనైన నవకాశ మున్నదని విశ్వసింతుమేని ఆ స్థలము ననే, మనము చిరకాలమునుండి దేనికై వెదకులాడు చుం టిమో అట్టి సత్య తత్వజ్ఞానము లభ్యమగునని నా యభిప్రా యము. కాబట్టి నా కీనాడు నిర్ణయింపబడిన మరణయాత్రను అత్యానందముతో చేయుదునుగాక! ఎవని మనస్సు సంసిద్ధమై పవిత్రమై యుండునో ఆటువంటి మానవుడు నావలెనే చేయ నగును. పవిత్రులగుటనగా, సాధ్యమైనంతమట్టుకు శరీరము నుండి ఆత్మవేఱై.ఆయాత్మ తను తానుగానుండి, సర్వవిధముల శరీరమునకు దూరమై, యిహపరములం దవకాశ మున్నంత వఱకు శరీర బంధమునకు బానిసకాకుండ యేకాంతవాసము చేయు సాధనను సాగించుటే యని మన మిదివఱకే గమ నించి యున్నాము.

## మరణము హితకరము.

మరణమనగా శరీరమునుండి ఆత్మవిడివడి స్వాతంత్ర్యతను పొందుటేగదా! నిజముగా తత్త్వవేత్తయగు నతడు తనయాత్మకు స్వాతంత్ర్యమును గూర్చుటకై నిరంతరము వాంఛించువాడగుటచేత ఏకాంతవాసియై యుండగోరును. మఱియు వాని విద్యాభ్యాసమంతయు,శరీరమునుండి ఆత్మను వేఱుపఱచి దాని బంధనమునుండి ఆత్మకువిమోచనము కూర్చుకొఱకేయగును. అట్టివాడు తనకు సాధ్యమైనంతవఱకు మృత్యుదశకు సమీపముగా నిరంతరము జీవింప నభ్యాసముచేయుచుండును. అట్టి మృత్యువాసన్నమైనప్పుడు అతడు మొఱలిడుట విపరీతముగ గాన్పించును. నిజముగు తత్త్వపరాయణుని చదువులెల్ల మృతికొఱకే! నరులలో నెల్ల అట్టివానికి మృత్యుభీతి అత్యల్పము. అతడు మృత్యువును జయించి దాని సహచరుడై మనుచు, ప్రతి యంశమునను శరీరసహవాసమునకు అతడు విముఖుడుగ నుండును. తనయాత్మకేకాంతస్థితిని గూర్చుకొనుటకు అతడు వాంఛించుచుండును. తాను దేనికొఱకై యావజ్జీవము పరితపించెనో అట్టి జ్ఞానమును తాను పొందగలట్టియు, ప్రతిబంధకముగా నెంచిన శరీరము నుండి విడివడి మనగలట్టియు స్థలమునకు బోవుట పొసగినప్పుడు, ఆనందించుటకు మారుగా తన కోరిక ఫలించునప్పుడు భీతిలి మొఱలిడుట యెంతయు అవివేకమగును కాదా! నరుని ప్రేమకు లక్ష్యమగు భార్యయో,

బిడ్డయో పోయిన సందర్భములందు అట్టివారిని చూడగలమ
నియు వారి సహవాసమున నుండగలమనియు ఆశపెట్టు
కొని అనేకులు ఉత్సాహముతో పరలోకమున కేగుటయు
కలదు! ఇట్లుండ దివ్యజ్ఞానముకొఱకై నిజముగా పరితపించు
నతడు, మఱియు అజ్ఞానము పరలోకమున మాత్రమే లభించు
ననియు మఱెక్కడను లభింపబోదనియు, దృఢముగనమ్ము
నతడు మృత్యువనిన విషాదము పొందునా? ఏమాసవుడై
నను మరణ మాసన్నమైనప్పుడు దుఃఖించునెడల అతడు జ్ఞాన
ప్రియుడు కాడనియు దేహప్రియుడనియు స్పష్టముగనమ్మెదు.
బహుశః అతడు ధనమునో కీర్తినో లేక యారెండింటినో
ప్రేమించువాడునై యుండవలయును.

ధీ ర త్వ ము .

ధీరత్వము తత్త్వజ్ఞుని విశిష్టలక్షణముసుమా! సంయ
మనము అనగా వ్యసనముల నిరసించునట్టియు ఇంద్రియ
ముల నిర్జించునట్టియు మఱియు వానిని వశమున నుంచుకొను
నట్టియు సాధనము. ఇయ్యది శరీరమసిన నుపేక్షించి తత్త్వ
విచారమున కాలముగడుపు వారియందే కాన్పించును. ఇం
దుకు ధీరత్వము అత్యవసరము. ఇతరులందు పొడసూపు
ధీరతయు సంయమనమును కేవలమిథ్యారూపములు! విపరీత
లక్షణములు ననవలయును. ఎట్లో వివరింతును. తత్త్వపరాయ
ణులు కాని వారెల్లయును నరుని పైబడు ననర్థములలో

మరణ మొకటని భావింతురు. మృతియనచాలభీతిల్లుదురు. ఒక
వేళ అట్టి వారిలో ధీరులుగ చూపట్టి కొందఱు మృత్యువు
నకు వెనుదీయరేని, వా రంతకుమించిన అనర్థములగూర్చి
బెదరిపోయి విధిలేక మృత్యువున కొండంబడువారే! కాబట్టి
తత్త్వవేత్తలుతప్ప తదితరులు భీతివలన ధైర్యము వహింతు
రనవలయును. వారియందు ప్రధానముగా నుండునది
భయము ఆ భయము వలననే వారు ధీరులుగ గాన్పిం
చుట విపరీతలక్షణమేకదా! మరియు వారిలో మంచి శీల
ముగలవారు చూపట్టినచో వారిస్థితియు ఇట్టి విపరీతదశయే
యనవలయును. ఒక్కొక రీతి లోలతకు లోబడి పోయినవారు
నిగ్రహమును పూనుచుందురు. వారిది నిజమగు సంయ
మనము గాదు; కృత్రిమపు నిగ్రహమనదగును. వారు ఏవేవో
భోగముల కాశపడుదురు. ఆ భోగ వాంఛలకు దాసులై
వానికి భంగము కలుగునను భీతివలననే తదితర భోగము
ముల యెడ నిగ్రహము వహించినటుల చూపట్టుదురు. కావున
వారు కొన్ని భోగములకు దాసులైన కారణముననే తది
తర భోగములను త్యాగము చేయుచున్నారు. కావున భోగ
లాలసవలన కలిగిన సంయమనము అసత్యమును, విపరీత
మును అనవలయును. యోగ్యమగు శీలము ఇటువంటి విని
మయమునకు అనగా ఒకదానికొఱకు మఱొక దానినిమార్చు
కొను పద్ధతికి లోబడునదికాదు సుడీ. ఒక భోగముకొఱకు
వేఱొక భోగమును, ఒక బాధకొఱకు యింకొక బాధను,

ఒకభీతికై మఱొక భీతిని, గొప్పదాని కొఱకు కొద్దిదానిని డబ్బులనువలె మార్చుకొనుటకు వీలగునదికాదు. ఇటువంటి విషయముల నన్నింటిని పూర్తిగ వెలగొనుటకు సమర్థమగు శ్రేష్ఠమైన నాణెము ఒకటి కలదు. అదియే జ్ఞానము. ఈజ్ఞానము కొఱకుగాని లేక ఈ జ్ఞానము నొసగిగాని వినిమయము చేయబడిన ధైర్యము,ధర్మములనునవియేమాననీయములు. ఒక మాటలో చెప్పెదను. నిజమగుశీలము జ్ఞానమునకు దూరమై యుండజాలదు. సుఖము, భయము అట్టి మఱే యితర విషయముల ప్రసక్తియు దానికిలేదు. ఒండొంటితో విని మయముపొందు దుఃఖములతోడను, సుఖములతోడను సంబంధము కలిగి జ్ఞానమునకెడమైన శీలము సచ్ఛీలముయొక్క ఛ్ఛాయామాత్రమనియు, అందు స్వతంత్రతగాని, నిర్దుష్టత గాని, సత్యత్వముగాని శూన్యములనియు నాయభిప్రాయము. తథ్యమగుశీలమనగా నీచవిషయములనుండి నరుని ఉద్ధరించు పవిత్రకర్మవంటిది. సంయమనము, ధర్మము, ధీరత, జ్ఞానము సయితము శౌచకర్మలే. నిగూఢములగు బోధలొనరించిన మన పెద్దలు యేదొఘనతరోద్దేశముతో శాసనముల రచించి యుందురు. హృదయ సంస్కారమును పొందక భక్తియులేక స్వర్గారోహణముచేయ నెంచువారు కర్మపంకిలమున జిక్కువడియుందురనియు పవిత్రులై సంస్కారశీలురగు వారు దైవ సాన్నిధ్యమును పొందుదురనియు నీతికథరూపమున మన పెద్దలు మనకు సదా బోధించుచునేయున్నారు. తీర్థవాహు

లు చాలగానుందురు. కాని వారిలో సంస్కారపరులు స్వల్ప
ముగనుందురని కడు నిగూఢముగ మన దివ్యగాథలందు చెప్పి
యున్నారు. ఈ తుది వారు తత్వాన్వేషణ పరాయణులని నా
నమ్మకము. నేనటువంటివారిలో ఒకడనగుటకొఱకు నా యావ
జ్జీవమును గట్టి ప్రయత్నమును చేసియున్నాను. శక్తివంచన
లేకుండ నేనటుల చేసితిని. నేను సరియైన త్రోవనే నడిచినది
నాయత్నము ఫలించినది లేనిది కొలది సేపటిలో, నేను పర
లోకమును జేరునప్పుడు ఈశ్వరేచ్ఛయున్నచో తెలిసికొనగలు
గుదును. మిమ్మును ఇచ్చటి అధికారులను విడిచి చనుటలో
విచారముగాని, కోపముగాని కలుగు కారణము నాకులేదని
చూపుటకే నాయీసమాధానమంతయును! చాలమందినమ్మక
పోవచ్చును. ఉత్తరలోకమునందు యీలోకమునందు వలెనె
ఉత్తములగు నధికారులును స్నేహితులును నాకు లభింప గల
రని నా విశ్వాసము. నాపైని అభియోగమును విచారించిన
న్యాయాధికారుల యెదుటకంటె మీయెదుట ప్రతివాదము
సలుపుకొనుటలో నే నెక్కువ విజయము గాంచినయెడల నా
కదియె చాలును."

ఈ పలుకుల నాలకించిన సిబీసిట్లనెను;— "సోక్రటీసు!
చాలవఱకు నీవు చెప్పినదంతయు నొప్పిదమే యగునని నాకు
తోచుచున్నది. అయినను ఆత్మనుగూర్చి నీవు చెప్పెదాని
యెడల ప్రజల కంతగా విశ్వాసములేదు. శరీరమును విడిచిన
పిమ్మట ఆత్మ యెచ్చటనో నుండబోదనియు మృత్యువు ఘటి

ల్లిన దినమునందే విచ్ఛిన్నమైనశించు ననియు వారి భయము. అది శరీరమునుండి విడివడి వెడలిన తత్క్షణమునందే ఊపిరివలెనో లేక పొగవలెనో విచ్చిపోయి నాశమగుననియు, ఆపిమ్మట దానికి ఉనికియే యుండజాలదనియు వారు తలంతురు. నీవింతకు మునుపు పేర్కొనుచుండిన యనర్థములనుండి తప్పించుకొని యెక్కడనైన నెక్కుచెదరక నిలుచుటకు వసతిగలదేని నీవు చెప్పినది సత్యమే యని యాశపడుట కవకాశమున్నది. కాని మరణానంతరము ఆత్మ నిలిచియుండు ననియు దానికేదేని సమర్థతగాని, విజ్ఞానముగాని యుండుననియు ఆశను గొలుపజాలు ఉత్సాహమును, నిబ్బరమును అల్పముగ నుండినను చాలదు.”

## ఆత్మ అవిచ్ఛిన్నము.

సోక్రటీసిట్లు సమాధానము చెప్పెను. “ఇప్పుడు నేను చెప్పు మాటలు విను వారెవ్వరును, ఒకవేళ హాస్య ప్రబంధ కారులైననుగూడ, నేను అప్రస్తుత విషయములను గురించి వ్యర్థప్రలాపముల చేయుచుంటినన బోరని నాతలంపు. మీకిష్టమైనచో యీసమస్యనుగూర్చి సూక్ష్మతర పరిశీలనము చేయుదము.

మరణానంతరము నరులయాత్మలు ఉత్తరలోకమున నుండునా నుండవాయనుటను పరిశీలింతము. అవి యీలోకమును విడిచిన యనంతరము కొంతకాల ముత్తరలోక

మున వసించుననియు తిరిగివచ్చి యిక్కడ చచ్చినవారి స్థాన
మున జన్మించుననియు ప్రాచీన కాలమునుండి ఒకవిశ్వాసము
కలదనుటను మఱువకుందుముగాక. పూర్వము చచ్చినవారిలో
నుండియే యిప్పుడు బ్రతికియున్నవారు జననముగాంచుట సత్య
మయ్యెనేని మనయాత్మలు పరలోకమున కొంతకాల ముండ
వలసినవే యగును. లేనిచో అవి తిరిగి జన్మింపజాలవు.
చచ్చినవారి నుండియే బ్రతికి యున్నవారు పుట్టుదురని
మనము నిజముగా ఋజువుచేయజాలుదుమేని ఆత్మలుత్తర
లోకమునందు వసించునని ఋజువు చేసినట్లు యగును.
అటుల ఋజువుచేయజాలమా వేరొక శ్రేష్ఠతరసమాధాన
మునకై వెదుకవలసియుండును.

మానవులకు సంబంధించినంతమట్టుకే గాక పశువులు
పక్షులు, వృక్షములు యింతేల పుట్టుక గాంచు సమస్త
వస్తువులకును యీ సమస్య ననువర్తింపజేసి విచారించుటే
దీని పరిష్కారమునకు అత్యంత సులభమార్గము. ద్వంద్వ
భావమున కవకాశ మిచ్చు ప్రతిదియు దానికి వ్యతిరేక
మగు ప్రతిరూపమునుండియే పుట్టుననుట సామాన్యధర్మమే.
ద్వంద్వము లనగా నా భావమిది. ఘనము, క్షుద్రము,
ధర్మము, అధర్మము మొదలగునవి వేలకొలంది సూచింప
వచ్చును. ఇక ద్వంద్వభావమున కవకాశమిచ్చున దెల్ల
తనకు వ్యతిరేకమగు దానినుండియే పుట్టవలసియుండునేమో
విచారించుదు. ఉదాహరణ చూపుదు, ఒకటి పెరిగినదనిన

యెడల అది తక్కువగా నుండిగదా పెరుగ గలదు. ఒక
వస్తువు తరిగిన యెడల అది మొదట హెచ్చుగానుండి తదనం
తరము తరుగవలసి యుండును. బలహీనమగునది బలతరమగు
దానినుండియు; వేగముగలది మందమగు దాని నుండియునే
గదా కలుగును? ఉత్కృష్టమైన దానినుండి నికృష్టమై
నదిపుట్టును. ధర్మమైన దానినుండి అధర్మమైనది పుట్టును.
సమస్తమును యీ తీరున వ్యతిరేక రూపములనుండి కలు
గుచుండును. ఇట్టి ద్వంద్వ రూపములలో ప్రతి జంటలోని
రెంటిమధ్యను ద్వివిధ జన్మలు కలుగుచున్నవి. ఒకటి
తనకు వ్యతిరేకమగు ప్రతిరూపమునుండి పుట్టును. మఱల
నిది మొదటి రకపు దానికి జనకమగును.

హెచ్చుతగ్గులగు వానిలో పెరుగుట తరుగుటలు రెం
డుండును. మరియు వియోగము, సంయోగము, శీతలము,
ఉష్ణము అను జంటలు గలవు. మనము సదా వాగ్రూపము
నవ్యక్తము జేయజాలకున్నను వ్యతిరేకరూపములు ఒండొంటి
నుండి పుట్టుట సహజసార్వజనిక ధర్మముగ కాన్పించుచున్నది.
నిద్రకు జాగరము వ్యతిరేక రూపమగునటుల జీవమునకు
మరణమను వ్యతిరేక రూపము కలదు. జీవమరణములు పర
స్పర వ్యతిరేక రూపములై ఒండొంటి నుండి పుట్టుచున్నవి.
వాని నడుమ రెండు తెగల జననము లుండును. నిద్రనుండి జాగ
రము పుట్టుచున్నది; మఱల జాగరమునుండి నిద్రపుట్టుచున్నది.
ఇటులనే సజీవముల నుండి మృతములు, మృతములనుండి సజీ

వములు పుట్టవలయును. కావున చేతనములగు జంతువు లును, సజీవులగు నరులు సైతము మృతులైన వారి నుండియే కలుగుచున్నారు. దీని నొప్పుకొనినచో మన ఆత్మలు పరలోక మునుండి యుండెనని ఒప్పుకొనవలసివచ్చును. ఇట్టి రెండు విధములగు పుట్టుకలలోను ఒకటి ధృవము. మృత్యువు ధృవ మని తోచుచున్నది. ఇది ప్రత్యక్షము. ఇప్పుడు దీనికి వ్యతిరేక ముగనుండు సంఘటనను నిర్ణయింపవలయును. లేనియెడల ప్రకృతి ధర్మ మిక్కడ భగ్నమగుచున్న దనవలయును. మృతి నొందుటకు వ్యతిరేకక్రియ నొకదానిని నిర్ణయింపవలసి యున్న చో అది యేమై యుండగలదు? పునఃజన్మమెత్తుటేగదా. తిరిగి సజీవులగుటయను సంఘటనమే యుండెనేని మృతులనుండి సజీవులు పుట్టుట ఒప్పుకొనక తీరదు. అనగా బ్రతికియున్న వారిలోనుండి మృతులు కలుగునటులనే మృతులనుండి సజీ వులు పుట్టుదురని అంగీకరింపవలయును. అప్పుడు అట్టి మృతుల యాత్మలు యెందుండి మరల వచ్చి జననముగాం చునో అటువంటి స్థలమున వాసముచేసి యుండుననుట రుజు వైనట్లేగదా.

మనము తేల్చిన పర్యవసానము అసమంజసము కాదని నా తలంపు. 1. వ్యతిరేకరూపములు ఒండొంటి ననుసరించి వర్తింపని యెడలను; 2. అవి ఒండొంటినుండి పుట్టుచు చక్రా కృతిని తిరుగునవి కానియెడలను; 3. ద్వంద్వములలో నొకటి సజాతి రూపమునుండియే పుట్టుచు, జననమనునది ఓకే దిశగా

సరళ రేఖపై నడుచునెడలను 4. దేని జననమును వెనుకకు గాని, దాని ప్రతిరూపము దిశకుగాని తిరుగనియెడలను, సర్వ పదార్థములును తుట్టతుదకు ఒకే యాకృతిని పొంది ఒకే దశకు రావలసియుండును. అప్పుడు జననమను నదియే ఆగి పోవును. కొంచెము వివరముగా చెప్పెదను.

ద్వంద్వక్రియలలో నొకటి యగు "నిద్రించుట"కు దాని నుండి పూర్వము పుట్టియుండవలసిన "మేల్కొనుట" అను క్రియతో నెట్టి సంబంధము లేనియెడల ప్రపంచములోని జీవు లన్నియు ఎప్పుడో ఒకప్పుడు నిద్రపోయి తిరిగి మేల్కొంచు టనునదియే లేక పోవును. అది మహా ప్రళయదశ. ఇట్లే ప్రాణము గలవన్నియు మరణించి తిరిగి జన్మము గాంచక నిలిచిపోవునెడల తుద కన్నియు మృతములగుస్థితి సంఘటిల్లును, ఒక్కటియును చేతనమన గలదియే యుండదు. ఈ జీవరాసు లన్నియు మృతములనుండి పుట్టినవి కానియెడలను, మృత్యే తరాధారములనుండి పుట్టి తుదకు మృతినొందు నెడలను ఎన్నడో సర్వమును మృత్యువున కాహుతియై పోవలసి వచ్చును. మనము తేల్చిన పర్యవసానము పొరపాటు గాకుండ మరల చక్కగ విచారించుదము:— చచ్చినవారు తిరిగి పుట్టుదురు. ఇప్పుడు సజీవులైయున్నవారు మరణించినవారి నుండియే పుట్టిరి. మరణించు వారి యాత్మలు నశింపక నిలి చియుండి తీరవలయును. ఉత్తముల యాత్మల కా స్థితి ఆనంద కరముగను, దుష్టుల యాత్మల కది దుఃఖకరముగనుఉండును."

అప్పుడు సీబీసు అను నతడు సోక్రటీసును జూచి యిట్లనెను; "నీవు పదేపదే తెలుపు సిద్ధాంత మొకటి కలదు, మన జ్ఞానార్జన మంతయు మఱచిన దానిని పునఃస్మృతికి దెచ్చుకొనుటయే యగుచుండును. అది సత్యమగునేని మన మిప్పుడు పునఃస్మృతికి దెచ్చుకొనుదానిని పూర్వమెన్నడో యెఱింగియుండవలయును. అట్లగుచో మనయాత్మలు యీ నరరూపముల దాల్చుటకు పూర్వమును ఎక్కడనో యుండి యుండని యెడల వానికి పూర్వజ్ఞాన ముండుటే అసంభవ మగును. ఆత్మలు నిత్యములనుటకు ఇదొక హేతువగు చున్నది."

అపుడు సిమియాసు సీబీసున కడ్డమువచ్చి అట్లను టకుగల నిదర్శనములను కోరెను. అంత సోక్రటీసిట్టుల వివ రింపసాగెను.

### పునఃస్మృతియే జ్ఞానోదయము.

దేనినైనను మనము జ్ఞప్తికి దెచ్చుకొన్న యెడల పూర్వ మెన్నడో మనము దాని నెఱిగియుండవలయుననుట నొప్పుకొని తీరవలయును. చూడుడు. ఒక డొకవిషయమును చూచి నాడు; లేక విన్నాడు లేక మఱే ఇంద్రియముతోడనో గ్రహించినాడు. అప్పుడతని కావిషయము తెలియవచ్చుటే కాక ఆ జ్ఞానమునకు భిన్నముగానుండు వేఱొక విషయ

మునెుక్క * సంస్కారముగూడ వాని మనస్సున స్ఫురింప వచ్చును. ఈ సందర్భమున వాని మనస్సులో అదివఱకే సంస్కారమును గలిగించియున్న విషయము వానికి పునః స్మృతికి వచ్చినదనుట సమంజసమేగదా!

ఇంకను విశదము చేసెదను. ఒకడు తన స్నేహితుని పీటనో ఉత్తరీయమునో లేక అత డుపయోగించుకొను వేఱొక వస్తువునో చూచు చనుకొనుము. ఆపీటను అతడు గుర్తుపట్టును. అప్పుడు వానిమనస్సులో ఆ పీటకు యజమానియగు వాని స్నేహితుని రూపుకూడ స్ఫురించును. దీనిని పునఃస్మృతి అందుము. ఒకడు సీబియానును చూచునప్పుడెల్ల సిమియానును స్మరించును. ఇటువంటి నిదర్శనములను ఎన్నిటినేని చెప్పవచ్చును.

మఱియు అనేక దినముల క్రిందటజూచి యుపేక్షచే మఱచిపోయిన వస్తువులగూర్చి యిటువంటి జ్ఞప్తియే కలిగిన యెడల అదియు పునఃస్మృతియే యగును. ఒక గుఱ్ఱముయొక్కయో, పీటయొక్కయో బొమ్మనుజూచి మన మొక

* సంస్కారములేక వాసన అనగా పూర్వ మొకప్పుడు అనుభవించిన విషయమువలన మనస్సుపైన నాటుకొనినగుర్తు. అనుభవములు స్వస్వరూపములలో మనస్సున నిలిచియుండకున్నను వాని ఫలితార్థములు మనస్సున ముద్రితములై నిలిచియుండును. ఒకడు నిన్ను తిట్టును. కొంతకాలమున కాతిట్లు, తిట్టిన సందర్భము మఱపునకు వచ్చును. కాని వానిపైని గలిగిన క్రోధము, ద్వేషము నీమనస్సున నిలిచి యుండును. వీనినే పూర్వసంస్కారములు, పూర్వవాసనలు అనియు పేర్కొందురు.

మనుష్యుని జ్ఞప్తికి దెచ్చుకొనవచ్చును. ఒకని రూపసట మునుజూచి మఱొకని స్మరణకు దెచ్చుకొనవచ్చును. ఇట్లు సజాతీయములగు వస్తువులవలనను సజాతీయములు కాని వస్తువుల వలననుకూడ పునఃస్మృతి కలుగగలదు. పోలిక గలవస్తువులను సజాతీయములందురు; వాని మూలమున పునఃస్మృతికలిగిన సందర్భమునను నయితము అటుల స్మృతికి వచ్చిన దానికిని ఇప్పుడు ప్రత్యక్షముగ చూచుచున్న దానికిని పోలికలలో వ్యత్యాసములను కనిపెట్టవలయునను సంకల్పముగూడ పుట్టవచ్చును. జాగ్రత్తగ విచారించి యీ చెప్పబోవు విషయము సత్యమో కాదో నిర్ణయించుడు.

సమత్వమనునది యొకటి కలదని మనకు నమ్మకము కలదా? సమత్వమనగా కొయ్యముక్కలందును రాతిముక్కలందును చూపట్టు సమానత్వముకాదు. సమానమను ధర్మమునుగూర్చిన భావనను సమత్వ మనుచున్నాము. అటువంటి ధర్మముకల దందుమా లేదందుమా?"

ఆచట నున్నవారందఱును అట్టిధర్మ మొకటి కలదని ప్రత్యుత్తరమిచ్చిరి. సోక్రటీసు మఱల ప్రసంగమును సాగించెను.

"ఆ జ్ఞానము మనల కెటుల గలుగుచున్నది? మన మింతకు పూర్వము చెప్పుకొనుచున్నరీతిని సమానములగు కొయ్యముక్కలను, రాతిముక్కలను మఱిట్టివానిని వేనినో చూచుట వలననేకదా? వానిని చూచుటవలన స్థూలము

గానుండువానికి భిన్నముగానుండు ఒకధర్మమునుగూర్చిన భావ
మును మనకు కలుగుచున్నది. మనము సమానములను
కొయ్యముక్కలను రాతిముక్కలను ఏమాత్రమును మారక
స్వస్వరూపములతో నున్ననూగూడ ఒకప్పుడవి సమాన
ములుగను, మఱొకప్పుడు భిన్నములుగను కాన్పించుట
గల్గును. సంపూర్ణముగ సమములగు వస్తువు లెన్నడైన
అసమానములుగ అనగా భిన్నములుగ కాన్పింపజాలవు.
వానియందలి సమత్వధర్మము అసమమై, విషమమై తోప
జాలదు. కావున సమానములగు వస్తువులన్నను, సమత్వ
మన్నను వేఱని తెలియగలము. అయిననుగూడ సమత్వ
ధర్మమునకు భిన్నములుగానుండు ఈ సమములగు వస్తువుల
యాధారమువలననే ఆ సమత్వధర్మమును మనము భావన
చేయుటయు, సమత్వ ధర్మమనగా నేదియో తెలిసికొను
టయు సంభవించుచున్నది.

ఒక వస్తువుయొక్క దర్శనము వేఱొకవస్తువును గూ
ర్చినస్మృతిని నీమనస్సునకు తెచ్చినచో ఆ రెండువస్తువులును
సమములైనను కాకున్ననుకూడ పునఃస్మృతి యనునది సంఘ
టిల్లుచున్నది. ఈవిధానములో మనము చెప్పుకొనుచుండిన
సమానములగు కొయ్యముక్కలుగాని, రాతిముక్కలుగాని,
మఱిట్టివేవిగాని మనకు ప్రతిబంధకములగుచున్నవా? అగుట
లేదా ? అవి కేవలసమత్వ ధర్మ మంతగా సమభావమును

తోపజేయుచున్నవా? లేక సమత్వధర్మముచే స్ఫురించు సమ తకు కొఱవడి కాన్పింపవచ్చునా? విచారింపుడు."

ఇట్లు సోక్రిటీసు ప్రశ్నింప నిస్సంశయముగ అవి చాల విధముల కొఱతలు గలవిగా నుండునని సిమియసు జవాబు చెప్పెను. మఱల సోక్రటీసిట్లు పలుక దొడగెను: "ఇంతవఱకు మనభావము లేకీభవించి యున్నవిగదా; ఒక వస్తువునుచూచి ఒక డీవిధముగ తలంచును: ఈ వస్తు విం కొక దానిని పోలియున్నది. కాని దానితో తావలివేసి పరీక్షిం చినయెడల దీనిపోలికయందు చాల కొఱతలు కాన్పించును." సరే, ఆతడిప్పుడు చూచువస్తును దేనితోపోల్చి అట్లు తీ ర్మానించుచున్నాడో అట్టి వస్తువును పూర్వ మొకప్పుడు అతడు చూచియుండక తప్పదు. మనము సమానములగు వస్తువులను చూచి వానియందు సమత్వము చూపట్టుచు న్నను అవి కొంతకొంత న్యూనాధిక్యలతో ఉన్నవని నిర్ణ యింపవచ్చును. అట్లు చేయుటకు పూర్వము కేవల సమ త్వధర్మమును గూర్చినజ్ఞానము మన కుండి తీరవలయును. మఱియు చూచుటచేతనో, తాకుటచేతనో, మఱే యింద్రి యానుభవముచేతనో తప్ప పూర్వముగాని యిప్పుడుగాని కేవలసమత్వము గ్రహించుట సంభవమును కాజాలదు. ఏ దె ట్లున్నను మన యింద్రియానుభవములకు వచ్చు విషయము లన్నియు సమత్వమును సంపూర్ణముగ వహింపబూని కిం చిత్తు భేదములు గలవగుచుండుటను మనము తెలిసికొను

టకు యింద్రియములేగదా యధారము. మనము చూచు
టకుగాని, వినుటకుగాని మఱేయింద్రియానుభవమునైనను
పొందుటకు గాని ప్రారంభించుటకు మునుపే, కేవలమును
సత్యమునగు సమాత్వముంగూర్చిన జ్ఞానము మనకుండియే తీర
వలయును. అట్లుకాదేని సజాతీయములగు యింద్రియాను
భవ విషయములను సమత్వ ధర్మముతో పరీక్షించి అవి
ఆ సమత్వధర్మము వహించుటకే సర్వవిధముల ప్రయత్నిం
చుచును స్వల్పభేదము గలవగుచున్నవని మనము గ్రహిం
చుటకే అవకాశములేదు.

జన్మకుపూర్వమే జ్ఞానముండును.

మనము పుట్టినప్పుడే చూచుటకు, వినుటకు మఱియు
నితర యింద్రియముల వినియోగించుటకు శక్తి గలిగి యుంటు
న్నాము. కేవలసమత్వధర్మము యొక్క జ్ఞానమును మన మీ
యింద్రియములకంటె ముందుగనే పొందియుండ వలయును.
కావున పుట్టుటకు పూర్వమే సమత్వమును గుర్తించు జ్ఞాన
మును మనము పొందియుండవలయును. అట్టి జ్ఞానముతో
పుట్టితిమేని, సమానవిషయములనే గాక వాని న్యూనాధి
క్యతలను మఱియు నటువంటి వ్యత్యాసములను సర్వమును
మనము పుట్టుటకు పూర్వమును పుట్టిన క్షణముననుు తెలిసి
కొన జాలియున్నామని ఒప్పుకొనవలయును. మన ప్రస్తుతపరిశో
ధనము సమత్వమునుగూర్చియే కాదు. కేవలశుభము, కేవల

సౌందర్యము, కేవల న్యాయము, కేవలపవిత్రత మున్నగు విష యములన్నింటికిని సంబంధము గలిగియున్నది. మఱియు మన సంభాషణలోని యథార్థములని పేర్కొన దగిన సర్వమున కును సంబంధించి యున్నది. కావున సత్యత్వముగల సర్వవిష యములయొక్క జ్ఞానమును పుట్టుటకు పూర్వమే మనము కలిగియుండి తీరవలయును. అటువంటి జ్ఞానమును కలిగియుండి యు ప్రతిపర్యాయమును మనము మఱచి పోవుచున్నాము. అట్లుగాక మనమా జ్ఞానముతోడనే పుట్టుచూ యావజ్జీవము దానిని నిలుపుకొనియే యుందుము. ఎందువలననగా తెలి యుట అని నప్పుడు జ్ఞానమును పొంది దానిని నిలుపుకొనుటయే గాని దానిని కోల్పోవుటగాదు. మఱచుటని నప్పుడు జ్ఞానమును కోల్పోవుటే యగుచున్నది. పుట్టుటకు పూర్వము పొందియున్న జ్ఞానమును పుట్టు సమయమున పోగొట్టుకొని ఆపిమ్మట మన యింద్రియములను విషయముల మీఁద ప్రయోగించుటచేత అది వఱకే యుండియున్న జ్ఞానమును తిరిగి పొందుచున్నాము. ఇప్పుడు విద్య గఱచుట యనగా పూర్వమే మనదైయున్న జ్ఞానమును స్వాధీనముచేసికొనుట యని తేలుచున్నది. దీనిని పునఃస్మృతియనుట సమంజసమే యగును.

మనముచూచుట చేతను, వినుటచేతను, ఇంకను నిత రములగు యింద్రియముల ప్రయోగించుటచేతను విషయము లనుగ్రహించుచున్నాము. మఱియు అటుపిమ్మట ఆవిషయ ములతో సంబంధము గలిగినట్టియు, పూర్వము మఱచినట్టియు

పేర్కొక విషయమును ఇప్పటి దానితో సజాతీయమైనను, సజాతీయముకాక పోయినను స్మరింపజాలుచున్నాము. కావున యీ చెప్పబోవు రెండు అంశములలో ఒకటి సత్యమై తీరవలయును. 1 మనము జ్ఞానముతోడనే పుట్టుచు దానిని యావజ్జీవము నిలుపుకొనువారమైనను కావలెను. లేదా 2. పుట్టిన యనంతరము జ్ఞానార్జనము చేయుచున్నాము; అనగా పునః స్మృతికి దెచ్చుకొనుచున్నాము అనవలయును. ఇట్లు జ్ఞానమనిన 'పునస్స్మృతి' యని యర్థమగుచున్నది.

కావున పుట్టుక సమయమున జ్ఞానశూన్యులముగ నుంటున్నాము. పునస్స్మృతివలన జ్ఞానకలితుల మగుచున్నాము అదిన యెడల అ జ్ఞానమును మన మెప్పుడు పోగొట్టుకొని నాము? జ్ఞానముతో గూడినవారమై పుట్టుట లేదని ఒప్పుకొందుము. ఇక పూర్వము మనకు జ్ఞానము కలిగిన క్షణముననే దానిని పోగొట్టుకొంటిమందుమా లేక యింకొక కాలమునందు పోగొట్టుకొంటిమని చెప్పుదమా? విచారింతముగాక!

సౌందర్యము, శుభము మొదలగు భావనలు శాశ్వతములై పఱగుచున్నవని సదా చెప్పుకొనుచుందుము. పూర్వమునందు మనకీ భావములుండి యుండెను; ఇప్పుడును కలవు. మన యింద్రియగోచరములగు విషయము లన్నింటిని ఈ భావముల ప్రసక్తితోడనే పరీక్షింతుము. ఈ భావముల సాహాయ్యముననే మన యనుభవ విషయముల నన్నింటిని ఒండొంటితో పోల్చి చూచి వాని యునికిని అంగీకరించుచున్నాము. కావున

మన పుట్టుకకు పూర్వమును. మనయాత్మలుండు నవేయని అం
గీకరింపవలసి వచ్చుచున్నది.

సోక్రటీసీకోరణిని ప్రసంగింపుచుండ సీబీసిటుల శంకించె
ను: "ఆనిర్ణయము యుక్తముగలేదు. అవసరమగు రుజువులో
సగము మాత్రమే లభించినది. ఒకడు పుట్టుటకు పూర్వము
వాని యాత్మ యున్నటుల చూపబడినది. ఈరుజువు సంపూ
ర్ణము కావలయు ననిన వాని యాత్మ వాని పుట్టుకకు పూర్వ
ముండిన తీరుననే వాని మరణాంతరమును నిలిచియుండగలదని
నిదర్శనము చూపవలసియున్నది."

అందుకు సోక్రటీసు ఇట్లు సమాధానము చెప్పదొడ
గెను: "ఆ యంశ మిదివఱకే స్పష్టము చేయబడియున్నది.
జీవులన్నియు మృతులనుండి పుట్టునని యిదివఱకు మనము చేసి
యున్న తీర్మానమును ఇప్పటి వాదమునకు తోడుచేసిచూడు
ము! ఆత్మకు పూర్వదశ యొకటి కలదు; అది జీవత్వమును
పొంది పుట్టుచున్నది; అనుచో అది మృతజీవులనుండియు,
మృతస్థితినుండియు రావలసినదే కదా? ఇప్పు డది జననముగాం
చవలసి వచ్చుటచేత, పూర్వపు మరణానంతరము అదినిలిచియే
యున్నదని ఒప్పుకొనవలయును. కాబట్టి నీవు శంకించు నంశ
ము ఇదివఱకే రుజువైయున్నది.

అయినను మీరీ సమస్య నింకను పరిశీలించుటకు
కుతూహల పడుచున్నారు. శరీరమును విడుచు నప్పుడు
ఆత్మ గాలిచే నెగరగొట్టబడి విచ్ఛిన్నమై పోవుననియు

ముఖ్యముగ ప్రశాంతవాతావరణములో గాక తుపాను గాలి వీచుసమయమున నొకడు మృతినొందునేని అటుల జరుగుననియు పసికూనలవలె మీరుభీతిని పొందుచునారు.

మిశ్రి పదార్థము మాత్రమే విచ్ఛిన్నము కాగలదు.

ఎటువంటివస్తువు విచ్ఛిన్నము కాగలదు? ఎటువంటి వస్తువు విచ్ఛిన్నమగుచో మనము భీతిలపలెను? అను ప్రశ్నలకు సమాధానమును గూర్చుకొని పిమ్మట ఆత్మ అటువంటి వస్తువగునా కాదా అని విచారింతము. కూడిక అనగా ద్రవ్య సంఘాతముచే నేర్పడు మిశ్రిపదార్థము మాత్రమే తాను ఏర్పడిన విధము ననుసరించి విచ్ఛిన్నమగును. విచ్ఛిన్నము కానిదేమేని ఉండుచో అది మిశ్రపదార్థము కాక ఏక తత్వమై యుండవలయును. నిర్వికారమై యొకేస్థితియందుండునదిమాత్రమే అమిశ్రపదార్థమగుట సంభవమగును. ఒకే స్థితియందుండజాలక సర్వదా మారుచుండునది మిశ్ర పదార్థమై యుండితీరవలయును.

ఉనికి యనునది అనగా సాంకేతిక భాషలో "కేవలాస్థిత్వము" అనునది సర్వదా ఒకే స్థితియందుండుట అని అర్థమిచ్చును. కేవలసమత్వము, కేవలసౌందర్యము, కేవలములగు యితర ధర్మములును మారుటకు వీలుండదు. నరులు, తురగములు, వస్త్రములు మున్నగు సుందరములనదగు వస్తువులు కలవు. అవి కేవలసమత్వము, కేవలసౌం

దర్వ్యము మొదలగు భావనలవలె నిర్వికారములై యుండఁ జాలవు. నీవు వానిని తాకి తెలిసికొనఁగలవు; కంటితో చూడఁగలవు. ఇతరేంద్రియములతో గుర్తింపగలవు. కాని నిర్వికారమై సుస్థిరముగ నుండువానిని బుద్ధిచేత తర్కించి మాత్రమే భావనచేయఁగలుగుదువు. ఇది అదృశ్యమై పఱగును. దృశ్యము అదృశ్యము నని అస్థిత్వము రెండుకోటుల పఱగుచున్నది. దృశ్యమగునది సదా మారుచున్నది. అదృశ్యమగునది నిర్వికార మనఁదగును.

నరులు శరీరము, ఆత్మ అను రెండింటితో గూడిన వారు. శరీరము దృశ్యాంశము. ఆత్మ అదృశ్యాంశము. శరీర సాహాయ్యమున విషయ గ్రహణము చేయుటనగా ఇంద్రియముల సాహాయ్యమున వానిని ఆత్మ గ్రహించుటయని యర్థము. చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణత్వగాదీంద్రియములను ఆత్మ ఉపయోగించుకొను ననవచ్చును. ఆత్మ అట్లు చేయునప్పుడు సదా చంచలములగు విషయములచే లాగివేయఁబడి గ్రుడ్డిగా తిరుగులాడును. సంతతము మారిపోవుచుండు విషయముల ప్రసక్తి పెట్టుకొనుటచేత గ్రాగినవానివలె అది తికమకలు పడి భ్రమలు చెందుచుండును. అట్లుకాక ఆత్మ తనకు తానుగా ఏసమస్యనైనను పరిశీలించునప్పుడు తాను దేనితో సజాతీయమగునో అటువంటి నిర్మలశాశ్వతామృత నిర్వికల్పాఖండ తత్త్వము దరికి చేరును. అటుల తనుతానుగా నుండఁగల్గు నప్పుడును, ఉండునప్పుడును, అఖండముయొక్క సాంగత్యము

వనే మెలగును. అంతట నది తిరుగులాటమాని శాంతిని బడ యును. మఱియు తానప్పుడు నిర్వికార పరిపూర్ణముయొక్క సంగతి నుండుటంజేసి తానును నిర్వికారమై నిలిచియుండ గలదు. ఆత్మయొక్క ఈస్థితినే జ్ఞానసిద్ధావస్థయని చెప్పుదురు.

ఈవిషయము నింకొక విధముగగూడ పరిశీలింతము. శరీరాత్మలు రెండును సహవాసము చేయునపుడు వానిలో నొకటి బానిసలీల వర్తింపుచుండ రెండవది యాజమాన్య ముచేయుచుండును. ప్రకృతియే అటుల నిర్ణయించుచున్నది. వీనిలో దైవసంబంధమైనది సహజముగ పాలనాధి కారము కలిగియుండవలెననియు మర్త్యసంబంధముగలది సహజముగ దాస్యము చేయుచు బానిసయై యుండదగుననియు తోచును.

ఆత్మ దైవీయము, అమృతము, జ్ఞానవంతము, నిరవ యవము, అవినాశి, నిర్వికారము అని తెలిసికొంటిమి. శరీ రమో మానుషము, మర్త్యము, జడము, సావయవము, వినాశి, సవికల్పము నైనది. అటులగుచో స్వభావము చేతనే శరీరము త్వరలో విచ్ఛిన్నమగునది; ఆత్మ చెక్కుచెదరక నిత్యమై యొప్పదగినది అనవలయును. సరే; ఒక్క మను ష్యుడు మరణించునప్పుడు వాని దృశ్యాంశమగు శరీరము శవరూపమున జడప్రపంచమున పడియుండును. అది విచ్ఛి న్నమై చెదిరిపోవును. అయినను శరీరము సయితము తక్షణమె విచ్ఛిన్నమై చెదిరిపోవుటలేదు. అనరుడు తరుణవయస్సున మరణించునెడల వాని శరీరము దీర్ఘకాలము సయితము

నిలచియుండగలదు "మమ్మీలను" ఈజిప్టుదేశపు మృతకళేబరములవలె తైలములు రాసి సుగంధ ద్రవ్యములతో భద్రపఱచినయెడల బహుకాలము చెక్కుచెదరక నిలిచియుండ నోపును. కొంతకుళ్ళినను వానిలోని కొన్ని భాగములు, ఎముకలు మున్నగువానికి నాశనము లేనట్లే తలంపవచ్చును.

ఇట్లుండ అదృశ్యమగు ఆత్మ ఈ లోకము విడిచి తనవలె తేజోవంతమును, అమలమును, అదృశ్యమునై అప్రత్యక్షలోకమనెడు సార్థక నామముగల పరలోకమునకు పోవును. భగవంతుని అనుగ్రహ మున్నచో నాయాత్మ అక్కడికే త్వరలో పోవునని ఆశించుచున్నాను. అట్టి లోకమునకు పోయి శుభంకరుడును, చిన్మయమూర్తియునగు భగవంతుని సన్నిధానమునవశింతును. ప్రకాశవంతమై, అమలమై, అదృశ్యమైనదగు ఆత్మ లోకులు పలుకుతీరున తనువునువీడగానె గాలికెగిరిపోయి నాశమగునని తలపదగదు. శరీరబంధముండగను త్యజింప నవకాశమున్నంతవఱకు దాని సంసర్గము తొలగించుకొని మరణకాలమున నిష్కళంకమైయుండు ఆత్మ గతి యేమగునో చెప్పెద వినుడు. మరణకాలమున అది శరీరమలముల నంటుకొనక తన కుశాగ్రమై యుండు ప్రయత్నమున శరీరప్రసక్తి తొలగించుకొని యేయుండును. ఆ ఆత్మ సదా సాధించి యుండు విద్యయే అది. అనగా ఆ యాత్మ నిరంతరము జ్ఞానాసక్తి గలదై సంతతము మృత్యు సాధననే చేసియుండును

ఇటువంటి దశను సాధించిన ఆత్మ మన పాలిటబడు

ప్రమాదము, దోషము, భయము, విషయవాంఛలు యింకి నిట్టి యనర్థము లన్నియు తొలగిపోవ, తనకు సదృశులైనట్టి దివ్యులును, అమృతులును, విజ్ఞాననిధులును అగు వారి చెంత కేగును. ప్రబుద్ధాత్మలు దేవతలతో గూడి ఆనందింపుచు పర లోకమున సత్యజీవనమును గడపుచుండును.

ఇక సంతతము శరీరము నంటిపట్టుకొనియుండి యింద్రి యములయెడ మోహమువహించి వానికి దాస్యము చేయుచు వానిచేత క్షుద్రముగ నొనర్పబడి విషయవాంఛలకును, భోగ ములకును మఱిగి లోలత్వమున కుపకరించు విషయముల గూర్చితప్ప సత్యమగు దేనినిగాని సంస్మరింపక పతితమై, కళంకితమైయున్న ఆత్మ, శరీరమును విడుచునప్పుడు పరలోక మున్న బెగడొందును; అసహనమును జూపును. ఇహలోకమునే అంటి పట్టుకొనును. అట్టి యాత్మల ఛాయారూపములే స్మశా నములందు సమాధులకడ గానంబడుచుండును. ఇవిసత్పురుషుల యాత్మలు కావు. దుష్టుల ఆత్మలు తమ దుష్కార్యముల ఫలితముగానట్టి స్థితిని బడయును. మఱల శరీరములందు బం ధింపబడు తరుణము వచ్చువఱకును నిటులనుండి, తాము పూర్వజన్మలందు కూర్చుకొనియున్న అభ్యాసముల కనుగు ణ్యములగు నైజగుణములతో నొప్పు శరీరములతో జన్మిం చును. మితిమీరి తిను తిండిపోతు పందిగనో, క్రూరకర్ముడు డేగగనో తోడేలుగనో, లంచగొండి కుక్కగనో, లేక యిట్టిగుణములతో హీనత ననుభవించు నికృష్ట నరుడుగనో

పుట్టును. ఉత్తమశీలురు సంఘోపకారులుగను, పూజనీయులుగను, సుఖవంతులుగను పుట్టుదురు

సంపూర్ణముగ నిర్దోషులును తత్వపరాయణులును జ్ఞానానంద సంధాయకులునుమాత్రము దేవతాగణములలోజన్మింతురు. ఆకారణముచేత వారీలోకమున భోగముల కాశించకుండ, లాలసాలంపటమున జిక్కుకొనక సంయమనముపూని వర్తింతురు. వారి సంయమనమునకు గారణము లోభత్వముకాదు; అవమానములకు వెఱచుట భీరుత్వము కాదు. కీర్తి ప్రతిష్ఠలకగు నారాటమును గాదు. సద్గతిగోరు బుద్ధిమంతు లెవరును పరుల నిగ్రహానుగ్రహములను పాటించి వర్తించువారుగాక, సద్గతి ప్రాపించు నిమిత్తము స్వధర్మనిర్వాహణకాముటై నిగ్రహము పూనుదురు.

తత్వపరాయణత యలవడని కాలమున ఆత్మ శరీరమున బంధింపబడి, యందుండి తానుచూడగలంతమట్టుకే చూచుచు పరమ పామరత్వమున బడియుండును. తనకా కారాగృహవాసము కామముచే సంభవించెనని తెలియదు. ఆ దశలో అనుభవించు దుఃఖములు ఫలించి తత్వవిచారణాభిలాషపొడముచును; ఇంద్రియముల మోసపు త్రాళ్లనుండి తప్పించుకొను యత్నము చేయుమని ప్రోత్సహించును. అత్యంతావసరమగు నప్పుడు తప్ప ఇంద్రియముల వినియోగించుకొనవలదని హెచ్చరించును. వాని బారి నుండి విడివడి తనకు తానై నిలచియుంట శుభకరమని బోధించును. మనోవికల్పములకు లోబడవలదని

యుపదేశించును. సత్యతత్వమును వివేకముచేసంపాదింపనగుస్తే గాని, దృశ్యప్రపంచాటోపముల మూలమున ప్రాపింపబాల మని రుజువు చేయును. తత్వవిదుని యాత్మ బంధవిముక్తి కద్దు పడుట దోషమగునని భావించి, తనకు సాధ్యమగు నంతవఱకు ఐహికములగు సుఖము, కామము, దుఃఖము, భయము, వీనినుండి దూరముగనుండును. ఎందువలన ననగా నరుడు సుఖము, భయము, దుఃఖము, కామము మున్నగు వాని యారాటమున జిక్కనప్పుడు, రోగముల వలనను కామతృప్తికి పూనుటచే గలుగు కీడుల వలనను మాత్రమే గాక యీ కామాది దుర్గుణములవలననుసయితము బాధలు వచ్చునని తత్వజ్ఞానుని యాత్మ బాగుగ గ్రహించును. మహత్తమమగు కీడులన్నింటిని ఇది భరించునుగాని, లెక్కసేయదు. అనగా నాభావ మిది: సామాన్య మానవుని యాత్మకు సుఖదుఃఖావేశములు కలిగి నప్పుడు, ఆ యనుభూత విషయమే దైనను, స్వతస్సిద్ధము గాకున్నను, విశిష్టమై సత్యమై పఱగునని యది భావించును. అటువంటి యనుభూత విషయములు ప్రధానముగా దృశ్యములై యుండును. ఆ దశలో ఆత్మ పూర్తిగ శరీరము యొక్క బంధనమున బడియుండును. ప్రతి సుఖమును ప్రతి దుఃఖమును ఒక విధమగు మేకు! ఈ మేకులును చీలలును ఆత్మను శరీరమునకు బిగించివేసి, శరీరమేమి చెప్పినను దానినెల్ల సత్యమని యొప్పునటులచేసి, దానిని శరీరస్వభావమునే కల్పనచేయుచుండును. ఆకారణమువలన శరీరముపొందు భ్రాంతులును ఆనందము

లును తనకును గల్గుటంజేసి, దానిమార్గమునే, దాని జీవన విధానమునే అవలంబింప వలసిన దగును. కావున నది శరీరమును విడుచు సమయమున దానిచే కళంకితమై యుంటవలన పరలోకముం జేరునప్పుడది నిర్మలముగ నుండ జాలదు. ఆ హేతువుచేత నటువంటియాత్మ వేగిరమే యింకొక శరీరములోనికి పడిపోయి, నేలలో నాటిన విత్తువలె, వేరులు పాతుకొనును. కాబట్టి దైవీయమును, నిర్మలమును, నిశ్చలమునగు తత్వప్రాప్తి లేకుండ పోవుచున్నది.

మఱియు నీ కారణములనుబట్టియే, సత్య తత్వపరాయణులగువారు ఇంద్రియ నిగ్రహమును పహించి ధీరులై యుండుట; లౌకిక లాభాపేక్షతోగాదు. తత్వపరాయణుని యాత్మ తనకు ముక్తినిగూర్చుకొనుటే తత్వజిజ్ఞాసయొక్కగమ్యమని భావించును. తత్వజిజ్ఞాస తనకు దేని దాస్యమునుండి ముక్తినొసగునో, అటువంటి సుఖదుఃఖముల దాస్యమున పడిపోవుటకు మఱల నిచ్ఛగింపదు. ఏమేని కర్మను చేసినను కర్మరాహిత్యము కొఱకై యే చేయును. కాని బంధనముల గల్పించుకొనుటకు చేయదు. అటులనా యాత్మ శాంతిని గూర్చుకొనును; సదా జిజ్ఞాన చేయుచు దానియందే నిమగ్నమైయుండును. సత్యమును, దివ్యమును, నిత్యమునగు దాని ధ్యానమునే చేయుచు దానివలననే ప్రవర్ధనము గాంచును. ఈ రీతిగా తా నీ జీవనయాత్రను గడుపుచు, మరణానంతరము తనను బోలునట్టియు తన నైజమున కర్హ

మైనట్టియు కావునకుబోయి, ఈజన్మయందువాటిలు ననర్థముల నన్నిటి నుండి మోక్షమును బడయుదునని విశ్వసించును. ఓ నా మిత్రులారా! ఇటుల పోషింపబడి, శిక్షణమును పొందిన యాత్మ తాను శరీరమును విడిచి చనునప్పుడు, భిన్నభిన్నమై, గాలి కెగిరిపోవునేమోయని గాని, మొదలే లేకుండబోయి సర్వ నాశము పొందుదునని గాని భీతిల్లదు సుడీ! దీనినిగూర్చి మీ కేమయిన సందియములున్న యెడల, వానిని దెలుపుటకు వెనుకాడవలదు. ఈవివరణము నింకను సూక్ష్మతరమును సమగ్రమునగు మార్గముననడుపవలయు నని మీయభిప్రాయమగుచో మీ భావముల వివరింపుడు. నా సహచర్యము వలన ఫలము గలదని మీరు తలంచుచో నన్ను గూడ మిమ్మనుసరింపనిండు"

అంత సిమియ సిగ్ము మరణాసన్న సమయమున వానిని శ్రమపెట్టుట యుచితము కాదని సంశయము దెలుప సోక్రటీసు మహాశయు డిట్లనెను.

## మృత్యువు దుర్గతి గాదు

మిత్రమా! నా కిప్పుడువాటిలినది దొక దుర్గతిగా తల పోయుట లేదని నేను నీవంటి వానికే నచ్చజెప్ప లేకపోయిన యెడల, నా సహజ చిద్వైఖరిని వీడి యిప్పుడు కృపణుడనై యుంటి నని నీవు సంశయించుచో, ఇతర జనులకు నచ్చజెప్పుట దుర్లభము. హంసలకు మరణ మాసన్నమైనదని తెలి

యువచ్చినప్పుడు, పూర్వము కంటె బిగ్గఱగా నెలుగెత్తి గానముచేయును. ఏలన అవి తమ స్వామి యగు భగవంతుని సన్నిధానమునకు బోవుచుంటిమను నానందముతో నిండిపోవును. రానున్న స్థితిని గ్రహించుటలో నేను వాని కంటె దీసతరా వస్థలో నుంటి నని నీ వభిప్రాయపడుచున్నట్లున్నది. మరణ భీతి గల మానవులు, హంసలును తమ మరణముం గూర్చి దుఃఖించుచు, విలాపము చేయుటకే ఎలుగెత్తి యఱచు నని పలుకుదురు. ఆకలిగాని చలిగాని మఱేబాధగానికలుగు నప్పుడు ఏపక్షియు రుతము చేయ దనుటను వారు మఱచుచున్నారు. చిలుకయు, గోరువంకయు మైనాపిట్టయు గాని హంసగాని దుఃఖముచేత గానము చేయునని నేను తలంప జాలను. హంస లు భగవంతుని వత్సములు గాన వానికి భవిష్యత్తు తెలియు ననియు రానున్న శుభముల, గుఱించి గానము చేయుననియు నా నమ్మకము. కాబట్టి యవి తమ యావజ్జీవమునందు కంటె మరణ దివసమున మహదానంద గానముచేయును. నేనీహంస లకు సహచరభక్తుడను; వాని దైవతమునకే నేనును స్వార్ప ణము చేసికొనియున్న వాడను; వానికి వలెనే నాదైవము నాకును భవిష్యత్సూచన నిచ్చి యున్నాడు. ఈ జీవనమును బాసిపోవుటలో నేను వత్సులకంటె హెచ్చుగ దిగులు పడుట లేదని నా విశ్వాసము. సన్ను శ్రమపెట్టుచుంటి మనుకొనక ఆదండనాధికారులు మిమ్ము మాటలాడ నిచ్చునంతవఱకు నాతో ముచ్చటింపవచ్చును. నీయిష్టము వచ్చిన ప్రశ్నల

లనుగవచ్చును; సంశయ మెంతమాత్రమును పెట్టుకొనకుడు" -అంతట సిద్ధియ సిట్లు వచింపదొడగెను. ఈ విషయములను గురించి యీ జీవితములో ఇదమిద్ధమని తేల్చుట దుర్లభము. బహుశః అసంభవముకూ కానగును. అయినను సర్వవిధముల బరిశోధించుటలో తనకిక సాధ్యముకాదని తోచునంతవఱకును, పూనిక వహింపనివాడు శుద్ధపామరు డనవలయును. విజ్ఞులవలన నేర్చిగాని, మనంతట మనము పరిశోధించిగాని పరమార్థ సత్యములను నిర్ధారణ చేయవలసియుండును. అది సాధ్యపడదా, మానవ నిర్మిత శాస్త్రమునందు అత్యంతము సహేతుకముగ దోచుదానిని అవలంబించి, తెప్పకొయ్యనమ్ముకొని యేఱు దాటువానివలె జీవనస్రవంతిని తరింప సాహసింపవలసియున్నది. అదృష్టవశమున భగవ దుద్దిష్ట శాసనమేదేని లభించి, దృఢతర నౌకారాజమువలె సుఖతరముగను సురక్షితముగను నావలి యొడ్డు చేర్చుచో ధన్యులమే !

### ఆత్మ లయమంటిదగునా ?

ఇక నన్ను బాధించు శంకను నివర్తి చేసికొనుటకై నినొక ప్రశ్న నడిగెదను; సంగీతమున 'లయ' అనుదానికిని ఉపకరణములకును నీవాదనను అనువర్తింప జేయవచ్చును. శ్రుతిచేసిన వీణలోని 'లయ' అదృశ్యమైనది; స్థూలము కానిది; సంపూర్ణముగ సుందరమును దివ్యమునై యొప్పు

నది. వీణెయు దాని తీగలును స్థూలములు, శరీర మువంటి స్వభావముగలవి; మిశ్రపదార్థములు (సావయవములు, భౌతికములు; నశ్వరముల బోలునవి, సరిగవా వీణె పగిలి తీగెలు తెగినప్పుడుగాని సడలిపోయినప్పుడు గాని 'లయ' యనునది నాశనమగుట లేదని నీవాదము ననుసరించి పలుకుదు మనుకొనుము; 'లయ' శాశ్వతముగ నిలిచియుండవలసినదే అని తర్కింతు మనుకొనుము. భూతవికారములగు వీణెయు తీగెలును శాశ్వతముగ నుండునని వాదించుట సాధ్యము కాకపోయినను, ఈ తీగెలు తెగిపోయినంతనే, దివ్యమై అమృతమై పరగు 'లయ'యు నాశమగుచున్నది ఆతీగెల కంటెను వీణె కంటెను ముందుగనే నాశనమగుచున్నది. 'లయ' శాశ్వతమై యెచ్చోటనో యున్నదనియు, ఈ కొయ్యయు లోహపు తీగెలును దానికంటె ముందుగనే విచ్ఛిన్నమై పోగలవనియు నొకడు వాదన చేయవచ్చును. మఱియు మనలో చాలమందికి ఆత్మ బహుశః మిశ్రపదార్థమే మొ యను సంశయము కలదని నీకును తెలియును. ఉష్ణము శీతము, పొడి తడి, మాంసము యెముక యిటువంటి తత్వములు చక్కగను తగు పరిమాణములతో సమ్మిళితము చేయబడి శరీరముగా నిర్మితమై కూడియుండు స్థితి 'లయ' వంటిదన వచ్చును. అప్పుడు ఆత్మయు నొకవిధమగు 'లయ' యే యందు మా? విషయము సుగ్రాహ్యమై పోగలదు. శరీరము మితిని దాటి సడలిపోవు నప్పుడు గాని, రోగములు మున్నగు ననర్థములచే వీణెయొక్క తీగె

లను అతిగ లాగి బిగించునటుల, పీడింపబడునప్పుడు గాని గానమునందలి 'లయ' వలెను, చిత్రకళలందలి సామరస్యము వలెను, ఆత్మ తానెంత దివ్యమైనదయినను వెంటనే నాశము గావలసినదే! శరీరమున మిగులునవో దహించి వేయువఱకును, లేక కృళ్లిపోవువఱకును అంతకంటె హెచ్చుకాలము కూడ నిలిచియుండ గలవు. ఆత్మ యన దేహతత్వ సంఘాతము వంటదే యనియు, మరణ మనునది సంభవించగనే మొట్టమొదటనే ఆత్మ నాశము కాగలదనియు వాదించువానికి సమాధాన మేమి చెప్పగలము.'

నరుని యాత్మకు పూర్వ జన్మ లున్నను శాశ్వతమా ?

అంతట సోక్రటీసు చేత హెచ్చరింపబడి సీబీసుకూడ తన సందేహము నీ క్రింది రీతిని దెలిపెను.

'నాది ప్రాత యాక్షేపణయే. నరరూపములదాల్చుటకు పూర్వము ఆత్మకు అస్తిత్వము కలదని నీవు చాల సమర్థతతో విశదము చేసితివి. కాని నరులు మృతినొందిన యనంతరము వారి యాత్మలు 'శాశ్వతముగ' నిలిచియుండునా యను నా యాక్షేపణ యటులనే యున్నది. సిమియసు సూచించినటుల గాక శరీరము కంటె ఆత్మ బలతరమనియు, స్థిరతరమనియు నొప్పుకొందును. నరుని అల్పతరాంశమగుశరీరము మరణానంతరము కొంతకాలమైనను నిలిచియుంట కండ్లాఱ జూచుచును అంతకాలమైనను మన జాలని ఆత్మ యేమాత్రమైన నేమి బలతరమునగునా యన సమాధాన మిది. ఒక కథ చెప్పెదను

ముసలి సాలెవాడొకడు మృతినొందినాడు. ఆతడునాశమందక యెక్కడనో పరలోకమున నిలిచియుండును; ఏలయన వానిచే నేయబడి మరణకాలమున వానిచే ధరింపబడియున్న వస్త్రము నాశము గాలేదు. నాశము చేయబడనులేదు. వస్త్రము కంటె వాని శరీరము బలతరము; శ్రేష్టతరము. అయినను ఆవస్త్రముకంటె ముందుగ వాని శరీరము విచ్ఛిన్నమై నశించుచున్నది. వాని శరీరము కంటె వాని ఆత్మ బలతరమైనది శ్రేష్ఠతరమైనది అయినను ద్వైవిధమున వాని శరీరము కంటె ముందుగనే నశింపవచ్చునుగదా? ఈ సందర్భములో ఇటుల తర్కింపనగును. ఆసాలెవాడు చాల వస్త్రములను నేసినాడు, ధరించినాడు ఆవినాశనముకాగా వాని శరీరము నిలిచియున్నది. కాని తుది వస్త్రము నశించులోపల వానిశరీరము నాశమొందినది. అటులనేయనేకశరీరములనుసృష్టి చేసికొనుచు,వానిలో నివసించుచు వచ్చినఆత్మ, తుది దగు నర శరీరమును ధరించి, మరణకాలమున దీని కంటె శీఘ్రతరముగా నశించునేమొ! ఆత్మ యనేకజన్మల నందుచు నరజన్మకు పూర్వము ఉండియున్నదనిన ను, తుదిదగు నరజన్మానంతరము మిగిలియుండు నని యెట్లు విశ్వసింపదగును? తుదివస్త్రమును, తుదిశరీరమును విడిచి ముసలి సాలెవాని యాత్మ నాశమైనదనరాదా యని యనేకులు శంకింతురు. ప్రతి జన్మకునంతమున ఆత్మకు హాని లేక పోవచ్చును; కాని తుదిశరీర పతనానంతరము నాశమందవచ్చును. ఆత్మనృశ్యవస్తువు కానందున, సి

మాటలను బట్టి ఆత్మ శాశ్వతమని భ్రమించుట కంటె దాని మరణముం గూర్చి శ్రద్ధ వహించుట మంచిది!"

ఈ పలుకు లాలకించిన యచ్చటి వారందఱును, సోక్రటీసు బోధలన్నియు భగ్నములైనవని వెఱగుపడిరి; రిచ్చపాటుం జెందిరి. సోక్రటీసుమాత్రము, నిశ్చలుడై, మిగుల నాదర మొప్ప వినుచు, శాంతముగను వివరముగను చిన్నిచిన్ని ప్రశ్నల నడుగుచు సమాధానములను వారిచేతనే జెప్పించుచు నీ క్రింది యంశములను జక్కగ బోధించెను. మోమోటములేక తన వాదన సిద్ధాంతములతో నిసుమంత లోపమున్నను వెల్లడింపు డని హెచ్చరించుచు నిటుల ప్రసంగమును సాగించెను. దాని సారాంశ మిది.

### సమాధానము.

మీయిరువురును జ్ఞానమనునది పునఃస్మృతి యని యంగీకరించియుండిరి. ఆసిద్ధాంతము ననుసరించి, ఆత్మలు శరీరములలో బంధింపబడుటకు పూర్వము, ఎక్కడనో యొక్కచోటున నుండి తీరవలయునుగదా! సరే, 'లయ' యనునది మిశ్రపదార్థము, అనగా అవయములతో గూడిన దంటిరి. అదితనకు పూర్వము కొన్ని స్వరములు పుట్టి వాని సమ్మేళనము ఘటిల్లినగాని యేర్పడదు. ఇట్టి ‹లయ›ను బోలి ఆత్మ దేహ తత్వములు సరిగా మేళగించుటచేత నేర్పడునదే యనెడు పక్షమున పునఃస్మృతి సిద్ధాంతము నిలువజాలదు. ఏయేతత్వములు గూడి

'లయ' యేర్పడునో వాని జననమునకు బూర్వము 'లయ' పుట్టినదనుట యెంతమాత్రమును పొసగదు కదా! ఇక నర శరీరమున ప్రవేశించుటకు బూర్వము ఆత్మ కలదని తీర్మానించితిమి. ఇప్పుడు 'లయ'కు పోల్చి ఆ యాత్మ యొక్క పుట్టుకకు పూర్వము పుట్టియుండదని,శరీరతత్వములతో ఆత్మ నిర్మాణమగునందుమా? ఆత్మను గూర్చి నీవు సమర్థించునట్టి విషయములకు పొందిక కుదురుటలేదు. వీణె, తంత్రులు, ధ్వనులు అను వానికి సమరసవరనము కూర్పబడక పూర్వము, లయ పుట్టి యుండవలయును. 'లయ'యో వీనికన్నింటికిని తుదను పుట్టును; కాని వానన్నింటికంటె ముందుగ నాశమగును. ఈసీ తీర్మానమునకును,జ్ఞానమనగా పునఃస్మృతియను సిద్ధాంతమునకును సఖ్యత పొసగుటలేదు. వీనిలో నే సిద్ధాంతమును స్థిరముగ నొప్పుకొందువు?"

ఇట్లడుగ సిమియసు పునఃస్మృతి సిద్ధాంతము నిశ్శంకముగ నంగీకరించుటచేత ఆత్మకును లయకును పోలిక నిలువజాలదని, తనవాదన నుపసంహరించుకొనెను. సోక్రటీసింకను నిట్లు పలికెను. ఈసమస్య నింకొకతీరున విమర్శింపవచ్చును. "లయ"గాని యింకేసంఘాత ఫలముగాని, తానేర్పడుటకు ఆధారములయియుండు తత్వముల నతిక్రమించి వానికి భిన్నమగుదశను పొందజాలదు. వానిని తిరస్కరించి తాను స్వతంత్రముగ నేపనినిగాని యొనర్పజాలదు.

ఆత్మ ఏయే తత్వములతోగూడి వర్తించునో, ఆ తత్వ

ములనన్నింటిని శాసించుచున్నది. జీవితమంతటియందును ప్రతి
విషయములోను ఆత్మ వానిని వెనుకొనుచునే యున్నది. ప్రతి
విషయమునందును వానిపై నధికారము వహించి, వానిని
శిక్షించుచున్నది; ఒక్కొక్కప్పుడు కఠినముగ శిక్షించుటయు
కలదు. గరిడీసాము, ఔషధప్రయోగము మొదలగు బాధ
కరశిక్షణ విధానముల ప్రయోగించును; కొన్నియెడల తేలిక
శిక్షణముల గఱపును; ఒక్కొకప్పుడు భయపెట్టును. కావున
మిత్రములారా! ఆత్మను "లయ" యనుటతప్పు. ఇక రెండవ
దగు సిబీసు వాదనను విచారింతము.

ఆత్మ బలతరమును దైవికమునై మనము నరజన్మ
మెత్తుటకు పూర్వము "అస్తిత్వము" గలదని ధ్రువపఱుపబడెను.
ఈ రుజువు ఆత్మ అమృతమనుటకు రుజువు కాదు. చాల కాల
ముండునదనియు, చాలకాల ముండి యుండి పూర్వదశయందు
చాలవిషయముల నెఱిఁగి, చాలకార్యముల గావించె ననుటకు
మాత్రమే ఆరుజువు ప్రయోజనకారి కాగలదు. కాని అంత
మాత్రముచేత అమృతము శాశ్వతము ననుటకు వీలుండదు.
నరశరీరమున దాని ప్రవేశమే దాని వినాశకారణమగు జాడ్య
ము వంటిదని సిబీసుసూచన. మఱియు ఈనరజన్మను దుఃఖము
లతోఁగడపి, మరణమను సంఘటనమున సర్వనాశమగునను,
ఆయా శరీరములం దాత్మ ఒక్కతడవ ప్రవేశము చేసినను
చాలసార్లు చేసినను ఆత్మ నిత్యమని రుజువుచేయజాలనియెడల
పిచ్చివారైననేతప్ప, ప్రతివాడును మరణమనిన భయపడవల

సినదే అని సీబీసు వాదన.

ఓ సీబీసూ! ఒకటిని ఒకటికి చేర్చునప్పుడు, ఇంకొకటి తనతో చేర్చబడుటవలన మొదటి ఒకటి ఎందుకు రెండైన దందుమో; లేక యిప్పుడు క్రొత్తగా చేర్చబడిన ఒకటి తాను దేనికి చేర్చబడెనో ఆ ఒకటితో గూడి ఎందుకు రెండైనదం దుమో నాకు విశదమగుటలేదు. అవి కలిపివేయ బడుటవలన గాని, లేక ఒక దాని ప్రక్క నొకటి పెట్టబడుటవలనగాని, ఒకటి రెండగుటకు కారణము తెలియుటలేదు మఱియు అవియే వేఱుగా నున్నప్పుడు రెండెందుకు గావో తెలియుట లేదు. ఇంకను చూడుడు; ఒక దానిని రెండుగా విభాగించి నప్పుడు, ఆవిభజనచేత ఒకటి రెండయ్యెనందురు. అల్లగుచో సరిగా విరుద్ధకారణములచేత ఒకటి రెండగుచున్నది. అను చున్నాము! మొదటియుదాహరణలో సంకలనముచేత అనగా ఒక దానిని ఇంకొక దానికి చేర్చుటచేతను; రెండవ యుదా హరణలో ఒక దానినే విభజించుటచేతను ఒకటి రెండగుట సంఘటిలుననుచున్నాను!

## కేవల ధర్మములు.

ఇట్లు విచారించుడు: ఒకటి అనుదాని పుట్టువెటుల ఘటిల్లుచున్నదో నేనింకొక విధముగా గ్రహింపజాలితిని. ఆవిషయమున మీరును నాతో నేకీభవింతురేమొ చూడుడు: కేవల సౌందర్యముగాక ఇంకనే దేని సుందరముగా కాన్పించు

యెడల ఆది కేవల సౌందర్యాంశమునొకింత పంచుకొని తీరవల యునని నాయభిప్రాయము. ఇంతకు మించి వేఱు కారణము లున్నవనిన నేను గ్రహింపజాలను. ఏదేని యొకవస్తువు దీప్తి వంతములగు రంగులు గలదగుట చేతనో, చక్కని ఆకారము గల దగుటచేతనో, మఱేకారణముచేతనో, సుందరముగ గాన్పించుచున్నదనిన యెడల నేనొప్పుకొనను. అన్ని సుందర వస్తువులును కేవల సౌందర్యధర్మమును తమయందు ఇముడ్చు కొనుటచేత మాత్రమే సుందరములు కాగల్గుచున్నవి. అన్ని పరిణామముల విషయము నిట్టిదే. పెద్దవగుట, చిన్నవగుట, పొడవగుట, పొట్టివగుట యిటులనే. ఇది మూఢభావమని మీరు నవ్వుదురుగాక. కేవల ధర్మమును పంచుకొనియే యేమైనను ఆధర్మముగలవగుచున్నవని నానిశ్చితాభిప్రాయము.

పరిమాణ ధర్మమనునదియే పెద్దవస్తువులను పెద్దవాని గను, చిన్నివస్తువులను చిన్నవానిగను చేయుచున్నది. ఒక మనుష్యుడు వేఱొకనికంటె తలచేత పొడవనిగాని, తలచేత పొట్టియనిగాని నీ వంగీకరింతువా ? పరిమాణధర్మము చేత, అనగా పొడవరితనము తనయందున్న యెడల పొడవరియగును లేదా పొట్టితనము తనయందుండుటచేత పొట్టియగును.

పది యెనిమిది కంటె రెండుచేత పెద్ద దగు చున్నది అనియు, అటుల పెద్దదగుటకు రెండు కారణ మనియు చెప్పుట ఆక్షేపణీయము. పదియెనిమిదికంటె సంఖ్యా ధర్మముచేత పెద్దదగుచున్నది. సంఖ్యాధర్మమే పది పెద్దదగు

టకు కారణము. అటులనే ఒకకట్ట మూడు మూరల పొడవుగల దానికంటె జేనచేత పొట్టిదగుననిన అంగీకరింప దగదు. అది పరిమాణధర్మముచేత పొట్టిదగుచున్నది. కాని మూరలచేతను జేనలచేతను పొట్టిదికాజాలదు.

అటులనే ఒకటిని ఒకటికి చేర్చినప్పుడు రెండగుటకు సంకలనము కారణమనిగాని, లేక ఒకదానిని రెండు ముక్కలు చేసినప్పు డది రెండగుటకు విభజనము కారణ మనిగాని పలుకునెడల నంగీకరింపదగదు. తన స్వకీయ వ్యక్తిత్వ ధర్మమును పొల్గొనుటచేత తప్ప, ఏవస్తువునకును ఉత్పత్తి, అనగా జననము కలుగజాలదు. ద్వైతధర్మమును పొల్గొనుటవలన తప్ప రెండున కుత్పత్తి సంభవము కాదు. సంకలనములును విభజనలును హేతువులుగ గ్రాహ్యములు కాజాలవు.

సిమియాసు సోక్రటీసుకంటె పొడవరి; సీబీసుకంటె పొట్టివాడు; అనునెడ సిమియాసు రెండు ధర్మములను పొల్గొనుచున్నాడు. పొడవరితనము పొట్టితనము అను రెండు ధర్మములు వానియందు సంక్రమించుచున్నవి. సిమియాసు సోక్రటీసుకంటె పొడవరియనునప్పుడు అతడు సిమియాసు అగుటచేత పొడవరియగుటలేదు. పొడవరితనము వానియందుండుటచేత అట్లగుచున్నాడు, మరియు అతడు సోక్రటీసుకంటె పొడవరి యగుట సోక్రటీసు సోక్రటీ సగుటవలననుకాదు. సిమియాసు పొడవరితనమును సోక్రటీసు పొట్టిదనమును పోల్చుటవలన అది ఘటిల్లుచున్నది. మరియు సిమియాసు సీబీసుకంటె పొట్టి

యగుట సీబీసు సీబీసగుటవలనను కాదు. సీబీసు పొడవరి తన
మును సిమియసు పొట్టితనముతో పోల్చుటచేత ఘటిల్లు
చున్నది. ఈవిధముగా సిమియసును ఇద్దరి నడుమనుంచి
సిమియసు పొడవరియనియుపొట్టియనియు చెప్పుచున్నాము.
ఒకని పొట్టితనమును ఇంకొకని పొడివరి తనముచేతను, రెం
డవ వానిపొడవరితనమును మొదటివాని పొట్టితనముచేతను
కల్పన చేయుచున్నాము. అనగా పరిమాణ ధర్మముచేత
కల్పనచేయుచున్నాము. నేను త్రాసుతో తూచినట్లు మాట
లాడుచు తర్కించుచున్నాను. ఎందుచేత ననగా నేను భావన
చేయుపద్ధతి ననుసరించి మీ మీ భావనలను నడుపగోరు
చున్నాను.

కేవలపు పెద్దతనము పెద్దదగుటగాని చిన్నదగుటగాని
సంభవింపదు. మనయందున్న పెద్దతనమును చిన్నతనమును
తనయందిముడ్చుకొనదు; ఇంకొక దానిని తన కతీతముగను
పోనియదు. పెద్దది తనకు భిన్నముగు చిన్నదిదాపునకు రాగనే
దానికి లొంగి పారిపోవలెను; లేదా నశింపవలెను. నాస్థితి
లోనేనుండి పొట్టితనమునే స్వీకరించి ఎప్పటి యటుల నేను
పొట్టివాడ నయ్యేయుండు తీరున, పెద్దది కొద్దితనమును స్వీక
రించి తాను తానుగాక మారి, తనస్థితిని నిలుపుకొనుటయు
పొసగదు. పెద్దతనము పెద్దదిగా నిలిచియుండి చిన్నది కాజా
లదు. అదే విధముగా చిన్నతనము పెద్దదిగా నగుటయు సంభ
వింపదు. ఇట్లే ద్వంద్వములలో నొక్కొక్కటి స్వధర్మమును

నిలుపుకొనియుండియు తనకు విరుద్ధమగు స్వరూపమును పొందజాలదు. అట్టి మార్పునకది లోబడినేని తాను రూపుమాసి నాశము కావలసివచ్చును.''

సోక్రటీసు ఇట్లు పలుకగానే అచ్చటి వారిలో నొకరు 'హెచ్చగునది తగ్గుదానినుండియు, తగ్గునది హెచ్చగుదానినుండియు పుట్టుననియు ద్వంద్వములు పరస్పర వైరుధ్యముగలవానినుండి పుట్టుననియు ఇంతకు పూర్వమేకదా మనము చెప్పికొంటిమి! ఆసిద్ధాంతమునకిది విరుద్ధముగ కాన్పించుటలేదా?' అని శంకించిరి.

### సందేహనివారణ.

అంతట సోక్రటీసు ఇట్లు విశదముచేసెను;"మంచి విమర్శనము! ఆరెండు ప్రతిపాదనలకునుగల భేదము కాన్పించుటలేదా? ఒకవిషయము దాని వ్యతిరేకవిషయమునుండి పుట్టునని చెప్పుకొని యుంటిమి. ఇప్పుడో మనయందుగాని ప్రకృతియందుగాని చూపట్టు నొకవిషయము తానే తనకు వ్యతిరేకవిషయముగా మారజాలదని చెప్పుచున్నాము. అప్పుడు ద్వంద్వధర్మమును స్ఫురింపజేయు వస్తువులనుగూర్చి ప్రసంగింపుచు వాని వాని వ్యతిరేకనామముల చేత పేర్కొంటిమి. ఇప్పుడో స్వతస్సిద్ధముగ భిన్నములగు విషయములగూర్చి ప్రస్తాపించుచు, వాని స్వకీయములగు ప్రత్యేకనామముల చేత వానిని సూచింపు చుంటిమి. ఇవి పరస్పరము ఒండొంటి

నుండి పుట్టునవి కావు. భిన్నవిషయములలో ఒకటి తనకు దానే విరుద్ధము కాజాలదు. శీతము ఉష్ణము అనబడు ద్వంద్వధర్మము లున్నవిగదా! అవియే మంచును నిప్పును అనవచ్చునా? శీతము మంచుకన్న వేఱు; ఉష్ణము నిప్పుకన్న వేఱు. మంచు ఉష్ణమును స్వీకరించి తన స్వస్వరూపముతో మంచును, ఉష్ణమునునై యుండజాలదు. వేడి దఱికిరాగానే తాను తొలగి పోవలెను, లేదా నాశముకావలెను. అగ్నియు, శీతము దఱి చేరునప్పుడు తాను తొలగిపోవలెను; లేదా నశింపవలయును. అది శీతమును స్వీకరించుటకోర్చి తాను నిప్పును శీతమును అయి స్వస్వరూపముతో నుండజాలదు.

ద్వంద్వలక్షణములలో నేదియు తనవ్యతిరేక ధర్మముతో పొత్తునంగీకరింపదు. ఇంతేగాక అట్టి వ్యతిరేక ధర్మము గల దేని పొత్తునుకూడ సహింపదు. శరీరమును సజీవముగ నొనర్చుటకు దానిలో ఆత్మయుండవలెను. దేనియందు ఆత్మయుండునో అదెల్ల సజీవమనవలెను. జీవమునకు వ్యతిరేకము మృతి; జీవమునకు మృతితో పొత్తు కుదురదు. ఆత్మ తాను వహించుదానియందు, అనగా సజీవశరీరమందు జీవవ్యతిరేకమగు మృతి నంగీకరింపదు. సరి అనుభావము బేసి అనుభావము నంగీకరింపదు. సరిసంఖ్యయందు బేసియను లక్షణమునకు తావులేదు. న్యాయము శ్రావ్యము అనుభావములు అన్యాయము అశ్రావ్యము అనుభావముల నంగీకరింపవు. ఈద్వంద్వ లక్షణములతో నొప్పువిషయములలో దేనికిని తన లక్షణము

లకు వ్యతిరేకములగు లక్షణములుగల విషయములతో పొత్తు కుదురదు. మృతికి వ్యతిరేకము అమృతము. ఆత్మ మృతి నంగీకరింపదు. కావున ఆత్మ అమృత మనవలయును.

మరల చూడుడు. శీతము అవినాశియగునేని మంచునకు ఉష్ణము దాపరించునపుడు ఆ శీతము వెడలిపోయి నాశమందకుండ నిలుపవచ్చును. కాని శీతము ఉష్ణము నంగీకరించియు నశింపక నిలచియుండు నన జాలము. అటులనే ఉష్ణము అవి నాశియైనయెడల ఉష్ణమునకు శీతము దాపరించునపుడు ఉష్ణము నిర్మూలమై నశింపదు. అది తొలగిపోయి సురక్షితముగ నుండును. అటులనే అమృతము మృతము కాజాలదు. అమృతమగునది అవి నాశియై యుండితీరవలయును కావున మృత్యువు తనపైన బడునప్పుడు ఆత్మ నశించు ననజాలము, అది అమృతమైయుండియు నాశము నెట్లు పొందగలదు? నరునికి మృతి సంభవించునపుడు వానిమర్త్యాంశమగు శరీరము మృతి పాలగును. వానిలోని అమృతాంశమగు ఆత్మమృతికి దూరముగ జని సురక్షితముగ అవినాశియై యొప్పును. కావునమనము మృతినొందునప్పుడు మనయాత్మలు సత్యముగా పరలోకమున నిలిచియుండునని చెప్పకొనవలెను.

### పునర్విమర్శనము.

ఈ యంశమునుగూర్చి గాఢముగా పునర్విమర్శనము చేయుడు. ఆత్మ నిత్యుననుట సత్యమగునేని జీవితకాలమని

మనము వ్యవహరించు కాలపరిమాణము వలెకేగాక సర్వకాల మును దానిక్షేమము నరయవలయును. ఉపేక్షించుచో గలుగు నపాయ మెంతయు భయంకరముగతోచును. మరణముసర్వ విషయములనుండియు పూర్ణముక్తియేయగుచో దుష్టులకది భగవంతు డనుగ్రహించు ప్రసాదమేయగును. వారు మృతినందు నపుడు శరీరములనుండియు, దుష్టత్వము నుండియుకూడ వారి యాత్మకు ముక్తి లభించును. కానిఆత్మ నిత్యమని తెలిసికొనియుం టిమి. మరియు ఆఆత్మ ముక్తినందుటకు సాధ్యమైవంతవఱకు పరి పూర్ణవంతమును విజ్ఞానవంతమును అగుటయే ఏకైకమార్గము అని గ్రహించితిమి. ఏలన తన విద్యను తన సంస్కారమును మాత్రమే ఆత్మ తనతోడ ఉత్తరలోకమునకు తీసికొని పోజా లును. మృతుడగు మనుష్యునకు పరలోక యాత్రారంభమున మహోపకారకరములుగాని మహానర్థదాయకములుగాని యుండునవివియే, ఏలయన నరుడుమృతినొందునపుడు జీవితకాల మున తనను రక్షింపుచువచ్చిన దైవతమునో, లేక, తనకు మార్గదర్శియై నడపు దేవదూతనో అనుసరించి పోవును. మృతులందరునుచేరి తమనుగూర్చిన న్యాయవిచారణ జరుగు ప్రత్యేకస్థలమునకును అచటినుండి తన యోగ్యతల ననుసరించి ఫలానుభవమునుపొందు లోకమునకును తోడ్కొని పోబడును. అచట నిర్ణీతకాలము గడపిన యనంతరము అతడు వేఱొక మార్గదర్శి ననుసరించి వెనుకకు తీసికొనిరాబడును.

అటుతరువాత పితృలోకమును గూర్చియు అందు

జీవాత్మ లనుభవించు అవస్థలను గురించియు గ్రీకుల శాస్త్రములు పురాణములు మొదలగువాని కనుసరణములగు సంగతులను తెలిపి సోక్రటీసు ఇట్లనెను.. "బుద్ధిమంతుడెవడును ఈవిషయముల సరిగా వానివర్ణనల ననుసరించి జరుగునవని నొక్కి వక్కాణింపబోడు.ఆత్మనిత్యమును అమృతముననిరుజమైనది; గాన పరలోకములందు దానియవస్థలు ఆవర్ణనల వలన సూచింపబడెనని మాత్రము తెలిసికొనిన చాలును. శరీర భోగములును శృంగారములును తనకు హానిచేయునేగాని మేలు చేయునవికావు; గాన తుచ్ఛములుగనెంచి ఈజీవితమున వైరాగ్యము పూనునరుడు తన యాత్మనుగురించి ఉత్సాహిమై యుండుటకు కారణముగలదు.శరీరసుఖములు, అలంకారములు మొదలగువానికి మారుగా విద్యానందమునకై తీవ్రముగ పాటుపడుచు ఆత్మకర్హములగు నిగ్రహము, న్యాయవర్తనము, సాహసము, స్వాతంత్ర్యము, సత్యము, మొదలగు నలంకారములతో తన యాత్మను అలంకరింపజూచునతడు తన యదృష్టమెచ్చటి కాహ్వానించిన అచ్చోటికి పోవుటకు సంసిద్ధముగ నుండును. పరలోకయాత్రకై మీరందరును మీ మీ సమయములు వచ్చినపుడు భవిష్యత్కాలమున నెప్పుడో ప్రయాణములు కట్టవలసియుండును. కాని నన్నో విధి ఇప్పుడే పిలుచుచున్నది. నేను స్నానముచేయు సమయమైనది. విషమును త్రాగుటకు పూర్వము స్నానము చేయుటమంచిది. నామృత కళేబరమునకు స్నానముచేయించు శ్రమ మీకును తగ్గగలదు."

చమత్కారముగను ఉత్సాహముతోడను సోక్రటీసు ఇట్లు సంభాషణమును ముగించునపుడు క్రీటోయను నతడు "సోక్రటీసూ! మీబిడ్డలను గురించిగాని ఇంక నితరవిషయము లను గురించిగాని నీస్నేహితులకును నాకును నీయాదేశము లేవయినగలవా ? యుత్తమమార్గమున మేము నీకెట్లు సేవ చేయగలమో చెప్పుము." అని అడిగెను.

## ఆ దే శ ము.

సోక్రటీసిట్లు ప్రత్యుత్తరమొసగెను; "మిత్రమా! క్రీటో! నేను సదా మీకు చెప్పుచున్నవిధాన వర్తింపుడు, చాలును. మీయాత్మలగూర్చి శ్రద్ధ వహించుడు. మీరిప్పుడు వాగ్దాన ముల నేమియుచేయ నక్కఱలేదు. మీరు కావించు పర్వము వలనను నాకును నాయాత్మకును మీకునుగూడ ఉపకారము లభింపగలదు. అట్లుగాక ఈనాడును పూర్వమును మన తర్క వాదనలందు చెప్పుకొనుచువచ్చిన జీవనపథమును అనువర్తింపక మీ ఆత్మలగూర్చి అశ్రద్ధ వహించువారలైతిరేని మీ రిప్పుడెన్ని వాగ్దానములు చేసినను అవెంతఘనము లయినను ఇసుమంతయు ఫలము చేకూఱబోదు."

క్రీటో మఱలనిట్లు ప్రశ్నించెను. "మాశక్తిగొలంది చేసెదముగాక ; సరే నిన్నెట్లు సమాధి చేయుమందువు? "

సోక్రటీసు వాని మందబుద్ధికి వెఱగుపడి సరసోక్తులతో నిట్లనెను;"మీయిష్టముచొప్పున చేయుడు. కానిమీరుమాత్రము

మొట్టమొదటగా నన్ను పట్టుకొనవలయునుసుమా! నన్నుమా
త్రము జారిపోనీయకుడు ! [అచటి వారినిచూచి నవ్వుచు]
మిత్రములారా ! నేను మీతో ప్రసంగించుచు మీ వాదముల
విమర్శించుచు నుండిన సోక్రటీసునని క్రీటోకు విశ్వాసము గలి
గించలేకున్నాను. కొలదిసేపటిలో శవముగా దాను చూడ
నున్న ఈశరీరమే నేనని అతడు భావించి తాను నన్నెట్లు పాతి
పెట్టుటోయని విచారింపుచున్నాడు! నేను విషమును త్రాగిన
యనంతరము మీతోడ నిలువబోననియు దివ్యానందము నను
భవింప వెడలిపోదుననియు మీకు రుజువుచేసి మీకును
నాకును సంతుష్టిని సంపాదింపనెంచి తెలిపిన సిద్ధాంతవాదన
లన్నియు వీనియెడల వ్యర్థములే యైయున్నవి. క్రీటో నాయ
భియోగ విచారణకాలమున నాకుజామీనుదారుడైయున్నాడు
మీరిప్పుడు నాకు జామీనుదారులై యుండగోరెదను. నేనె
క్కడికిని పారిపోక నిలిచియుందునని అతడు జామీ నిచ్చి
యున్నాడు. నేను మృతుడనై వెడలిపోదుననియు మీతోడ
నుండననియు మీరిప్పుడు జామీనియ్యవలసియున్నది. అప్పుడు
నామరణమును గూర్చిన యారాటమును ఇతడు తగ్గించుకొన
గలడు. నాకళేబరమును తగులబెట్టుటో పాతిపెట్టుటో జరుగు
నప్పుడు నేను దుర్భరబాధలను అనుభవించుచుంటినని భావించి
అతడు శోకింపక ఓర్చుకొనగలడు. మరియు నాఅంత్యక్రియల
సమయమున తాను క్రిందపెట్టునది స్మశానమునకు మోసుకొని
పోవునది పాతిపెట్టునది సోక్రటీసునే అనిచెప్పుటనుమాన వలెను!

మిత్రమా క్రిటో ! అపచారమగునటుల మాటలాడుట దోషము గుటేగాక ఆత్మ కనర్థమును గూడ సమకూర్చును సుమీ ! నీవు ఉత్సాహమును బూనుము. నాశరీరమును పాతిపెట్టు చుంటినని చెప్పుము. నన్నుగాదు; ఈ కళేబరమును నీయిచ్చ వచ్చిన తీరునను నీకు మంచిదని తోచినట్టి విధమునను పాతివేయుము."

ఈపలుకులతో సోక్రటీసు లేచి స్నానపుగదిలోనికి పోయెను. అచ్చటనున్నవారు, తాము వినిన బోధలనుగూర్చి ముచ్చటించుకొనుచు రానున్న మహదాపదనుగూర్చి శోకింప దొడంగిరి. తండ్రికి మరణ మాసన్నమైయున్న తరుణమున చిన్నబిడ్డలు దిక్కులేక అల్లాడు విధాన విలపింప సాగిరి. స్నానానంతరము సోక్రటీసు కొడుకులు (ఇద్దరు పసివారు ఒకడు పెద్దవాడు) వారికుటుంబపు స్త్రీలతోగూడి వచ్చిరి. వారికేదో హితబోధలుచేసి పంపివేసి, సోక్రటీసు తిరిగివచ్చి యితరులకడ గూర్చుండెను. విషమునిచ్చు రాజభటుడు సోక్రటీసు నెదుటికివచ్చి "మహానుభావా! అందరివలె నీవు నన్ను దూషింపవని నేనెఱుగుదును. అధికారులు నియమించుటచేత నేను విధిలేక వారికి విషము ద్రావనిచ్చినపుడు వారు నాపై గోపించి తిట్టుడివారు. ఇక్కడికి వచ్చిన వారిలోనెల్ల మీరు మహోత్తములు, సాధుపుంగవులు మహానుభావులు; నేనెరుగుదును. మీరు నాపైకినియకుడు. ఇందు దోషమెవరిదో మీకెఱుకయే. నేను సెలవుదీసికొందును. రానున్నదానిని

సాధ్యమైనంత ఓరిమితో భరింపుము. నే నెందుకు నియమింపబడి యుంటినో నీకు తెలిసియే యున్నది.” ఇట్లనుచు నావురని యేడ్చుచుచు అతడు వెడలిపోయెను. సోక్రటీసు వానివైపు జూచుచు, “మంచిది! నీవు చెప్పిన వకువున చేసెదను.” అనుచు అక్కడి వారికై తిరిగి ఇట్లనెను. “ఈ మనుజుడెంతటి సాదర మతి గలవాడో చూడుడు! నేనిక్కడ ఉన్నంతకాలము అతడు తరచుగా నన్నుజూడవచ్చుచుండును. ఒక్కొకప్పుడు నాతో మాటలాడేవాడు. చాలబుద్ధిమంతుడు. ఇప్పుడు జూడుడు. ఎంతటిసానుభూతితో నాకై శోకించుచున్నాడో! సరే క్రీటో అతడు చెప్పినటుల చేయుదముగాక సిద్ధముగానుండెనేని విష మును దెమ్మనుము. సిద్ధముగలేదా ఆయత్తము చేయు మనుము.”

అంతట క్రీటో ఇట్లు దీనాలాపము లాడసాగెను. “ఆగుము సోక్రటీసూ! సూర్యుడింకను పర్వతములపైగ నున్నాడు అస్తమయముకాలేదు. మఱియు విషము త్రాగు వారు సాధ్యమైనంత యాలస్యముగా త్రాగుదురు. ఆలోపుగ భోజ్యపానీయముల తృప్తిగ నారగించుటయు ప్రియ మిత్రు లతో వినోదముల సల్పజూచుటయు నే నెఱుగుదును. కావున నీవుతొందరపడకుము. ఇంకను సమయముగలదు.”

ఈ పలుకు లాలకించి నిశ్చలచిత్తముతో సోక్రటీసిట్ల నెను; “నీవు సూచించినవారు సహజముగా నటుల జేయు దురు. ఆరీతిగా వర్తించుట తమకు లాభకరమని, పాపము

వారు తలపోయుదురు. సహజముగా నే నటుల తలచువాడ గాను. కొంచెమాలస్యముగా విషము త్రావుటవలన లాభ ముండునని నే నెంచజాలను. అంతటి లుబ్ధత్వముతో జీవిత మును పొడిగించు కొనుటయందు నాకు నిరసనభావముగలదు. కాబట్టి నామాటను నిరాకరింపకుము."

అపుడు క్రీటో దాపున నిలచియున్న సేవకుని సైగనను సరించి విషపుగిన్నెతో రాజభటుడే తెంచెను. సోక్రటీసు వానిని చూచి, "అబ్బీ! నీకీవిషయములు బాగుగ తెలియును. నే నేమి చేయవలసి యుండునో చెప్పుమ"ని అడుగ నతడు "మీరు దీనిని త్రావి కాళ్ళు బరువెక్కువఱకును ఇటు నటు తిరుగ వలయును. పిమ్మట పరుండవలెను. అప్పుడు విషము దానిపని నది చేయును." అనుచు విషపుగిన్నె నందించెను. సోక్రటీసు మందహాసముతో దానినందిపుచ్చుకొని ఇసుమంతయుతొట్రుపాటులేక వివర్ణుడుగాక విచారసూచనా రహితుడై భటుని వైపు దృష్టినిలిపి "దీనినుండి కొంచెము తర్పణగా విడుచుటకు నీవేమందువు; నే నటుల విడువవచ్చునా లేదా?" అని యడి గెను. "సరిగా చాలునని మే మెంచునంత యే సిద్ధముచేయుదుము"ని అతడు చెప్పగా సోక్రటీసు "తెలసినది. నా ఈయాత్ర క్షేమ కరముగ సాగుగాక యని నేను దైవప్రార్థనచేయవచ్చు నను కొంటాను. అటులచేయుట విధి. అంతే నాప్రార్థన. తథాస్తు!" అనుచు విషపుగిన్నెను పెదవుల దాపునకెత్తి శాంత్యానంద ములు మోమున మెఱయ ఈషన్మాత్రము విషాదమును చూపక ఆ విషమును గ్రోలినాడు!

## అంత్యము.

ఇంతవఱకు మదిని చిక్కబట్టుకొని అచ్చోగూర్చుండి

యున్నవారు దుఃఖము నాపజాలక కన్నీరు వరదలై పాఱ శోకింపగడగిరి. సోక్రటీసు సుస్థిరచిత్తముతో వారలం జూచి, "మిత్రములారా! మీరేమి చేయుచుంటిరి? ఈ తీరున వేలలై విలాపము గావింతురనియేగదా స్త్రీల నావలకుబంపి వేసితిమి' నిబ్బరము చూపుడు! సాహసముతో నోర్చుకొనుడు! నరుడు ప్రాణము విడుచునపుడు నిశ్శబ్దముగా సర్వశాంతముగా నుండవలయు నందురు." అనెను. ఈ పలుకు లాలకించి లజ్జచే నచ్చటి వారొకింత నెమ్మదిగ కూర్చుండిరి. సోక్రటీ సంతట లేచి యిటునటు తిరుగసాగెను. కొంతసేపటికి కాళ్ళు బరువెక్కెనని చెప్పి విషము నిచ్చినబంటు యొక్క సన్నల ననుసరించి వెల్లికిల పరుండెను. ఆభటుడు తడవతడవకు వాని పాదములను కాళ్లను పరీక్షించుచు కొంతసేపటికి గట్టిగ నొక్కి స్పర్శ తెలియుచుండెనాయన సోక్రటీసు లేదనెను.

క్రమక్రమముగా పాదములు,పిక్కలు, తొడలు, పొత్తి కడుపువఱకును స్పర్శజ్ఞానముపోయి చలువలు క్రమ్మిబిగియుచు వచ్చెను. హృదయమున చలువలు సోకినవి. 'ముగిసెను' అను పలుకు సోక్రటీసునోట తుదిని వెలువడెను! ఇట్లు గ్రీసువీరుడును లోకైక ఖ్యాతిగన్న ప్రాచీన తత్త్వదర్శియు తనపేర నొకబోధ నా విధానమును ప్రపంచమునకు ప్రసాదించిన మహాత్ముడును ఇక్కటులకు వెఱువక తాజెప్పినటుల వర్తించిన ధీరుడును ఈ మర్త్యలోకమును వీడి భౌతిక జగములోనివారిని మాత్రమే స్పృశింపజాలు మృత్యువును అతిక్రమించి, మృత్యుంజయుడై అమరలోకము నలంకరింపబోయెను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాథ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాథవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాథ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | |
|---|---|
| 24. శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. హృదయంలో సాయి | 15-00 |
| 32. శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్ఛరిత్ర) | 120-00 |
| 33. గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | |
|---|---|
| 1. 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. సాదా క్యాలండర్ | 5.00 |
| 10. పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. పూర్వ పరాశరి | 100-00 |
| 20. పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. ప్రశ్న సింధు | 99-00 |
| 22. నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | |
|---|---|
| 25. ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. జాతక మకరందం | 63-00 |
| 31. జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. శుభశకునాలు | 30-00 |
| 42. హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. ముహూర్త దీపిక | 99-00 |
| 45. పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. కలలు ఫలితాలు | 30-00 |
| 47. జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. అంగసాముద్రికం | 36-00 |
| 55. హస్త సాముద్రికం | 63-00 |
| 56. లాల్ కితాబ్ | 99-00 |
| 57. శకునశాస్త్రం | 63-00 |
| 58. ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | |
|---|---|
| 60. అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. లగ్నరత్నాకరం | 63-00 |
| 63. షట్పంచాశిక | 120-00 |
| 64. 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. ముహూర్తచింతామణి | 99-00 |
| 72. సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. నాడీజ్యోతిషం | 63-00 |
| 80. నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. గౌతమసంహిత | 63-00 |
| 83. హోరరత్నమాల | 63-00 |
| 84. జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. వింత జోష్యములు | 63-00 |
| 88. షోడశవర్గులు | 200-00 |
| 89. రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | |
|---|---|
| 95. శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. లఘుజాతకం | 63-00 |
| 100. జాతకాలంకారము | 63-00 |
| 101. మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. నారద సంహిత | 200-00 |
| 114. పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. ఛాయాగ్రహములు | 99-00 |
| 119. జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

### బి.వి.రామన్ గారి గ్రంథములు

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్థరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

| | |
|---|---|
| 129. జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. ముహూర్తం | 75-00 |
| 132. విశిష్ట జాతకములు | 125-00 |
| 133. భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

## రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి
## శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు

| | |
|---|---|
| 136. బృహత్పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. బృహత్పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. బృహత్పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. బృహత్పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. భావార్థరత్నాకరము | 100-00 |
| 141. ముహూర్త చింతామణి | 100-00 |
| 142. ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. శతయోగమంజరి | 50-00 |
| 145. వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. వసంతరాజశకునమ్ (బృహత్శకునశాస్త్రం) | 250-00 |
| 148. వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. పంచాంగ వివేకము | 99-00 |
| 155. వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. పంచపక్షి శాస్త్రం (కేస్బైండ్) | 200-00 |

## 5. వాస్తులు

| | |
|---|---|
| 1. 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి | 180-00 |
| 2. వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. మీరూ మీ వాస్తు | 63-00 |

| | | |
|---|---|---|
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |

## 6. మంత్రశాస్త్రాలు

| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |

| | | |
|---|---|---|
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |
| 36. | రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. | లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. | హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |

| | | |
|---|---|---|
| 39. | మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. | శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. | స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. | కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. | శాంతితంత్రమ్ | 250-00 |
| 44. | యంత్రసిద్ధి | 360-00 |
| 45. | శ్రీ లక్ష్మీతంత్రమ్ | 360-00 |
| 46. | మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360-00 |
| 47. | మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360-00 |
| 48. | మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. | ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. | కామధేనువు తంత్రం | 360-00 |
| 51. | శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. | శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. | కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. | ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. | సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. | భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. | భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. | గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. | గణేశోపాసన 2 | 99-00 |
| 4. | నవగ్రహవైభవం | 99-00 |
| 5. | నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. | నవగ్రహ వేదం | 99-00 |
| 7. | శనిగ్రహారాధన | 99-00 |
| 8. | ఆదిత్యారాధన | 99-00 |
| 9. | సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. | శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. | లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. | హనుమదారాధన | 99-00 |
| 13. | లలితారాధన | 99-00 |
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |

| | | |
|---|---|---|
| 16. | వీరభద్రారాధన | 99-00 |
| 17. | కుజగ్రహారాధన | 99-00 |
| 18. | భైరవారాధన | 99-00 |
| 19. | దైవారాధన | 99-00 |
| 20. | గీతారాధన (భగవద్గీత శ్లోకతాత్పర్యసహిత) | 99-00 |
| 21. | శ్రీవేంకటేశ్వరాధన | 99-00 |
| 22. | హయగ్రీవారాధన | 99-00 |
| 23. | లక్ష్మీనరసింహారాధన | 99-00 |
| 24. | శ్రీ బాలాత్రిపురసుందరీ స్తోత్ర కదంబం | 99-00 |
| 25. | దేవీ లీలామృతం | 99-00 |
| 26. | పురాణపండ సుందరకాండ వచనం | 99-00 |
| 27. | పురాణపండ రామాయణం | 99-00 |
| 28. | పురాణపండ భారతం | 99-00 |
| 29. | పురాణపండ భాగవతం | 99-00 |
| 30. | (సూరి) వాల్మీకి రామాయణం | 99-00 |
| 31. | కాలసర్ప యోగం | 99-00 |
| 32. | నిత్య జీవితములో రుద్రాక్షలు | 99-00 |
| 33. | నిత్య జీవితములో నవరత్నాలు | 99-00 |
| 34. | వేదసూక్తములు | 99-00 |
| 35. | వేమన పద్యసారామృతం | 99-00 |
| 36. | పండగలు పర్వదినాలు | 99-00 |
| 37. | సూక్తిరత్నాలు | 99-00 |
| 38. | హనుమచ్చరిత్ర | 99-00 |
| 39. | నవగ్రహ దర్శనమ్ | 99-00 |
| 40. | నిత్యజీవితంలో నవగ్రహాలు | 99-00 |
| 41. | సాలగ్రామములు | 99-00 |
| 42. | గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 99-00 |
| 43. | శనిగ్రహరెమిడీస్ | 99-00 |
| 44. | జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 99-00 |
| 45. | వివాహజ్యోతిషమంజరి-మ్యారేజ్‌మ్యాచింగ్‌గైడ్ (సాయిగణపతిరెడ్డి) | 99-00 |
| 46. | మీపుట్టినతేదీనిబట్టి మీజీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) ,, | 99-00 |
| 47. | మీఅదృష్టానికి (పేరు) నేమ్‌కరక్షన్ ,, | 99-00 |
| 48. | న్యూమరాలజీ రెమిడీస్ | 99-00 |
| 49. | మూకపంచశతీ | 99-00 |
| 50. | శ్రీరామకర్ణామృతం | 99-00 |

| | | |
|---|---|---|
| 51. | రహస్యకుక్కుటశాస్త్రం | 300-00 |
| 52. | ఉపాసన విధానం | 99-00 |
| 53. | పంచమవేదం మహాభారతం | 99-00 |
| 54. | దేవుళ్ళ డాట్ కామ్ | 99-00 |
| 55. | గణపతిభాష్యం | 99-00 |
| 56. | యజుర్వేద ఉపనయనవివాహప్రయోగమంజరి | 99-00 |
| 57. | నవయోగులు | 99-00 |
| 58. | ఆంధ్రప్రదేశ్‌లోనిదర్శించవలసిన ప్రముఖదర్గాలు | 99-00 |
| 59. | సకలదేవతాఅష్టోత్తరాలు(పెద్దది)-(180అష్టోత్తరశతనామావళులతో) | 99-00 |
| 60. | సకలదేవతా అష్టోత్తరశతనామావళులు (కేస్‌బైండింగ్) | 216-00 |
| 61. | సకలదేవతా సహస్రనామములు | 99-00 |
| 62. | ఆధ్యాత్మిక సూక్తి నిధి | 99-00 |
| 63. | బ్రాహ్మణులు గోత్రాలు,ప్రవరలు | 99-00 |
| 64. | సర్వదేవతాస్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు | 99-00 |
| 65. | శ్రీ లక్ష్మీసన్నిధి | 99-00 |
| 66. | శ్రీలక్ష్మీ గణపతి హోమకల్పం | 99-00 |
| 67. | మార్షల్‌ఆర్ట్స్ (కరాటే,కుంగ్‌ఫూనేర్చుకోండి) | 99-00 |
| 68. | మ్యాజిక్‌గైడ్ | 99-00 |
| 69. | చదరంగం | 99-00 |
| 70. | పంచముఖ హనుమత్ వైభవం | 63-00 |
| 71. | గరుడపురాణం | 40-00 |
| 72. | మాఘపురాణం | 36-00 |
| 73. | శివపురాణం | 36-00 |
| 74. | వైశాఖపురాణం | 36-00 |
| 75. | కార్తీక పురాణం | 36-00 |
| 76. | కార్తీక పురాణం (చిన్నది) | 25-00 |
| 77. | సర్వకార్యసిద్ధికి రామాయణపారాయణ | 63-00 |
| 78. | పెద్దబాలశిక్ష | 50-00 |
| 79. | గాయత్రీ మహిమ | 36-00 |
| 80. | వృక్షదేవతలు | 63-00 |
| 81. | యాజుష స్మార్త సంస్కార చంద్రిక | 200-00 |
| 82. | సనాతనవైదిక బ్రాహ్మణస్మార్తాగమకల్పమ్ | 150-00 |
| 83. | చతుర్వేదములు | 120-00 |
| 84. | నవగ్రహారాధన | 120-00 |
| 85. | తాళపత్ర సమాహార గోపురం | 120-00 |
| 86. | మనుధర్మ శాస్త్రం (వచనంలో...) (కేస్‌బైండు) | 250-00 |

| | | | |
|---|---|---|---|
| 87. | మానవధర్మములు | | 120-00 |
| 88. | వేదమంత్ర సంహిత | | 120-00 |
| 89. | సహస్రలింగార్చన | | 120-00 |
| 90. | శ్రీ శివగీత | | 120-00 |
| 91. | ద్వాదశఉపనిషత్తులు | | 120-00 |
| 92. | పురాణపండవారి సౌందర్యలహరి | (కేస్‌బైండ్) | 250-00 |
| | (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) | సాదా | 120-00 |
| 93. | బృహత్ శివ స్తోత్ర రత్నాకరము | | 200-00 |
| 94. | బృహత్ దేవీ స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 95. | బృహత్ విష్ణు స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 96. | కేదారనాథ్ బదరీనాథ్ యాత్రాగైడు | | 63-00 |
| 97. | దక్షిణావృత శంఖములు | | 63-00 |
| 98. | 108 దివ్యదేశాల విష్ణుక్షేత్రదర్శని | | 36-00 |
| 99. | ధర్మసింధువు(కేస్‌బైండింగ్) | | 270-00 |
| 100. | భారతీయ శైవక్షేత్రయాత్రాదర్శిని | | 99-00 |
| 101. | చిలుకూరి బాలాజీచరిత్ర | | 36-00 |
| 102. | భగవత్‌స్తుతి | | 63-00 |
| 103. | సూర్యోపాసన | | 36-00 |
| 104. | కాశీఖండం | | 250-00 |
| 105. | దేవీభాగవతం | | 360-00 |
| 106. | శ్రీ ఆంజనేయం | | 216-00 |
| 107. | ధర్మసందేహాలు | | 216-00 |
| 108. | ఆధ్యాత్మిక దైవిక వస్తువులు | | 250-00 |
| 109. | రామాయణం | | 600-00 |
| 110. | పోతన భాగవతం | | 900-00 |
| 111. | శివమంత్రములు | | 63-00 |

## 8. వైద్య గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | ఆహారం ఆరోగ్యం | 36-00 |
| 2. | మూలికావైద్య చిట్కాలు | 36-00 |
| 3. | ఆయుర్వేద వైద్య చిట్కాలు | 30-00 |
| 4. | గృహవైద్య రహస్యాలు | 36-00 |
| 5. | గృహవైద్యసారం | 36-00 |
| 6. | హోమియోవైద్యం (ద్వాదశలవణచికిత్స) | 63-00 |
| 7. | ప్రకృతివైద్యం | 36-00 |
| 8. | ఆహారం-వైద్యం | 99-00 |

| | | |
|---|---|---|
| 9. | సంపూర్ణ ఆయుర్వేద-చిట్కా వైద్యం | 99-00 |
| 10. | ఆయుర్వేదమ్ | 36-00 |
| 11. | ఆయుర్వేద మూలికావైద్యదీపిక | 99-00 |
| 12. | దుంపకూరలు, ఆకుకూరలు, కాయగూరలు (వాడకం - ఉపయోగాలు) | 99-00 |
| 13. | ఏకమూలికావైద్యం | 99-00 |
| 14. | అష్టాంగ హృదయం (4భాగాలు) | 1200-00 |
| 15. | రహస్యసిద్ధయోగవైద్యసారమ్ | 99-00 |
| 16. | ప్రాథమిక హోమియోవైద్యం | 99-00 |
| 17. | ఒబెసిటి | 99-00 |
| 18. | హెల్త్‌గైడ్ | 99-00 |
| 19. | ఆయుర్వేదం-జీవనవేదం | 99-00 |
| 20. | ఫుడ్‌థెరపి | 63-00 |
| 21. | న్యాచురల్‌థెరపి | 99-00 |
| 22. | సంపూర్ణఆరోగ్యానికి 20ని॥ | 63-00 |
| 23. | కీళ్ళనొప్పులు మీ సమస్యలైతే... | 99-00 |
| 24. | యోగామంత్ర | 63-00 |
| 25. | యోగా మండే టు సండే | 63-00 |
| 26. | హెర్బల్ మెడిసిన్-హెల్త్‌టుడే | 99-00 |
| 27. | హెల్త్‌ఫైల్ | 108-00 |
| 28. | వస్తుగుణపాఠం | 250-00 |
| 29. | రసాయన వాజీకరణ తంత్రం | 150-00 |
| 30. | వస్తుగుణ మకరందం | 400-00 |
| 31. | నాటువైద్యం -(కేస్‌బైండ్) | 360-00 |
| 32. | నాటువైద్యం (చిన్నది) | 99-00 |
| 33. | ప్రాణాయామము-యోగ | 63-00 |

## 9. అయ్యప్ప - భవానీ రకాలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ అయ్యప్ప లీలామృతం | 30-00 |
| 2. | శ్రీ అయ్యప్ప భజనపాటలు | 63-00 |
| 3. | శ్రీ అయ్యప్ప పూజాకల్పం | 20-00 |
| 4. | శ్రీ అయ్యప్ప భక్తి గీతాలు | 20-00 |
| 5. | హారతిగైకొనుమా | 40-00 |
| 6. | శ్రీ అయ్యప్ప దీక్ష F | 10-00 |
| 7. | శ్రీ అయ్యప్ప భజనమాల F | 10-00 |
| 8. | శ్రీ అయ్యప్ప నిత్యపూజ P | 10-00 |

| | | |
|---|---|---|
| 9. | శ్రీ అయ్యప్ప నిత్యనియమావళి P | 10-00 |
| 10. | భవానీదీక్ష (శ్రీ భవానీ లీలామృతం) | 36-00 |
| 11. | దేవీలీలామృతం | 99-00 |
| 12. | శ్రీ దేవీ పూజాకల్పం | 20-00 |
| 13. | దేవీ భక్తిగీతాలు | 20-00 |
| 14. | భవానీదీక్ష P | 10-00 |
| 15. | దేవీ భక్తిమాల F | 10-00 |
| 16. | శ్రీ అయ్యప్ప భజనావళి | 120-00 |
| 17. | అయ్యప్పపూజావిధి (జేసుదాసుసాంగ్స్‌తో) | 24-00 |

## 10. భజనలు - కీర్తనలు

| | | |
|---|---|---|
| 1. | అన్నమయ్య కీర్తనలు | 20-00 |
| 2. | శ్రీరామదాసు కీర్తనలు | 20-00 |
| 3. | సర్వదేవతా మంగళహారతులు | 20-00 |
| 4. | వసుంధర మంగళ హారతులు | 25-00 |
| 5. | సౌభాగ్య దేవతా మంగళహారతులు | 36-00 |
| 6. | సర్వదేవతా భజనలు | 36-00 |
| 7. | చిట్టి పొట్టి పాటలు | 10-00 |
| 8. | జాతీయ గీతాలు | 10-00 |
| 9. | దేశభక్తి గీతాలు | 36-00 |
| 10. | పండుగలు-పుణ్యక్షేత్రాలు భక్తిగీతాలు | 36-00 |
| 11. | గొబ్బిళ్ళపాటలు,లాలిపాటలు,కోలాటపాటలు | 36-00 |
| 12. | అన్నమయ్య సంకీర్తనలు | 99-00 |
| 13. | పెళ్ళిపాటలు-స్త్రీలపాటలు | 36-00 |
| 14. | భక్తానంద భజనకీర్తనలు(ఓల్డ్‌సినీస్టైల్) | 36-00 |
| 15. | సర్వదేవతాభక్తిమణిమాల | 36-00 |
| 16. | బతుకమ్మ ఉయ్యాల పాటలు | 36-00 |
| 17. | అన్నమయ్య సంకీర్తనానిధి(1000కీర్తనలు) | 270-00 |

## 11. హిట్స్ సాంగ్స్

| | | |
|---|---|---|
| 1. | ఘంటసాల భక్తిగీతాలు-భగవద్గీత | 36-00 |
| 2. | ఎస్.పి.బాలు భక్తిగీతాలు | 36-00 |
| 3. | ఘంటసాల సుమధురగీతాలు | 99-00 |
| 4. | పి. సుశీల సుమధురగీతాలు | 99-00 |

| | | |
|---|---|---|
| 5. | ఎస్.పి. బాలు సుమధురగీతాలు | 99-00 |
| 6. | ఎస్.జానకి సుమధురగీతాలు | 99-00 |
| 7. | వేటూరి సుందరరామమూర్తిహిట్స్ | 99-00 |
| 8. | సర్వదేవతా సినీభక్తిగీతాలు | 99-00 |

## 12. స్త్రీలకు ఉపయుక్త పుస్తకములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీకాంతామణి వంటలు (వెజ్) | 63-00 |
| 2. | శ్రీకాంతామణి వంటలు (నాన్‌వెజ్) | 63-00 |
| 3. | శాకాహార వంటలు | 30-00 |
| 4. | మాంసాహారవంటలు | 30-00 |
| 5. | చిట్టిచిట్కాలు | 30-00 |
| 6. | అందానికి చిట్కాలు | 30-00 |
| 7. | పిల్లల పేర్లు (పెద్దది) | 30-00 |
| 8. | పిల్లల పేర్లు (చిన్నది) | 10-00 |
| 9. | లేటెస్ట్ ఎంబ్రాయిడరీ శాలీబోర్డర్స్ | 36-00 |
| 10. | లేటెస్ట్ ఎంబ్రాయిడరీ డిజైన్స్ | 36-00 |
| 11. | చిన్నారులకు చిరుతిళ్ళు | 30-00 |
| 12. | పసందైన ఫాస్ట్‌ఫుడ్ వంటలు | 30-00 |
| 13. | పలావ్‌లు, ఫ్రైడ్ రైస్‌లు, వెరైటీరైస్‌లు | 30-00 |
| 14. | వేపుళ్ళు-ఇగుర్లు | 30-00 |
| 15. | బ్రేక్‌ఫాస్ట్ వంటలు | 30-00 |
| 16. | పండుగలలో చేసుకొనే పిండివంటలు | 30-00 |
| 17. | మైక్రోవోవెన్ వంటలు | 99-00 |
| 18. | సర్వదేవతాభక్తిమాల | 36-00 |
| 19. | పిల్లలపేర్లు (బాబు) | 36-00 |
| 20. | పిల్లలపేర్లు (పాప) | 36-00 |
| 21. | మోడ్రన్ మెహంది (గోరింటాకు డిజైన్స్) | 36-00 |
| 22. | మోడ్రన్ పిల్లలపేర్లు | 99-00 |
| 23. | నోరూరించే నాన్‌వెజ్‌వంటలు | 99-00 |
| 24. | మోడ్రన్ టైలరింగ్ (లేడీస్ & జెంట్స్) | 99-00 |

## వివిధ రకాలు

| | |
|---|---|
| ఎందరోమహానుభావులు | 270-00 |
| యోగాసనాలు | 36-00 |
| సూర్యనమస్కారములు | 36-00 |
| పొడుపు కథలు (చిన్నవి) | 10-00 |

| | |
|---|---|
| హిందీ-తెలుగు-స్వబోధిని | 20-00 |
| ఇంగ్లీషు-తెలుగు-స్వబోధిని | 20-00 |
| జనరల్ నాలెడ్జ్ | 20-00 |
| నూరు ఎక్కాలు | 10-00 |
| 1-100 టేబుల్ బుక్ | 10-00 |
| 1-100 టేబుల్‌బుక్ (క్రౌన్‌సైజు) | 4-50 |
| శ్రీరామకోటి | 27-00 |
| శ్రీశివకోటి | 27-00 |
| మేజిక్ | 30-00 |
| అంకెలతో గారడీ | 30-00 |
| హృదయస్పందన (కవితలు) | 30-00 |
| వాత్స్యయన కామసూత్రాలు | 36-00 |
| ఎ.పి.టూరిస్ట్ గైడు | 36-00 |
| ఇంద్రజాల రహస్యాలు | 30-00 |
| మహేంద్రజాల రహస్యాలు | 30-00 |
| శరీరభాష (బాడీ లాంగ్వేజ్) | 99-00 |
| క్రియాయోగం | 36-00 |
| ఆనందంగా జీవిద్దాం | 99-00 |
| హరిశ్చంద్ర నాటకం | 50-00 |
| వాత్సాయనకామసూత్రాలు | 99-00 |
| పంచసాయకం | 99-00 |
| రతిరహస్యాలు | 99-00 |
| అనంగరంగం (కంభంపాటి స్వయంప్రకాష్) | 99-00 |
| శృంగారకేళి (కంభంపాటి స్వయంప్రకాష్) | 99-00 |
| గాయత్రీవిజ్ఞాన్ | 99-00 |
| చింతామణి (నాటకం) | 50-00 |
| బాలనాగమ్మ | 50-00 |
| కాళహస్తి స్త్రీల వ్రతకథలు | 36-00 |
| కాళహస్తి రామాంజనేయ యుద్ధం(బదిరెడ్డి) | 50-00 |
| కాళహస్తి గోవింద నామాల భగవద్గీత | 36-00 |
| కాళహస్తి గృహవాస్తు చింతామణి | 99-00 |
| కాళహస్తి గృహవాస్తు మర్మాలు (బైండు) | 63-00 |
| రామరాయవాస్తుశాస్త్రం(ముద్రగడరామారావు) | 90-00 |
| ఎం.ఎస్.ఆర్.హనుమాన్‌చాలీసా | 10-00 |
| ఎం.ఎస్.ఆర్.సుందరకాండ | 80-00 |
| బ్రహ్మంగారిజీవితచరిత్ర (జవంగుల) | 125-00 |
| శ్రీ ఆదిశంకరాచార్య దివ్యచరితామృతం | 40-00 |

| | | |
|---|---|---|
| కాశీరామేశ్వర మజిలీ కథలు | | 63-00 |
| శ్రీలలితాసహస్రనామము(భాస్కరభాష్యం) | | 600-00 |
| ప్రకృతిసిద్ధాంతములు-వేదవిజ్ఞానము-ఫలితజాతక సూత్రములు | | 595-00 |
| ముదుండి విశ్వనాథరాజుగారి గ్రంథములు | | |
| విశ్వకర్మ ప్రకాశము | | 80-00 |
| ప్రాచీనవాస్తుశాస్త్రాలు-ఆధునికవాస్తుపరిశీలన | ,, | 250-00 |
| నారద సంహిత | ,, | 150-00 |
| వాస్తురాజవల్లభము-మూలానువాదము | ,, | 60-00 |
| మయమతము - వచనము | ,, | 80-00 |
| బృహత్సంహిత - వచనము | ,, | 160-00 |
| వాస్తువిజ్ఞానజ్యోతి | | ...... |
| పురోహిత దర్శని (గోరసవీరభద్రాచార్య) | | .... |
| విశ్వకర్మవాస్తువిద్యారహస్యములు | ,, | .... |
| వాస్తు విజ్ఞాన చంద్రిక | ,, | .... |
| మహాదశా పారిజాతం | ,, | .... |
| వాస్తు నారాయణీయం | ,, | 120-00 |
| యోగావళీఖండం | ,, | 120-00 |
| ముహూర్తసింధువు | | 150-00 |
| సర్వార్థచంద్రిక (4భాగాలు) | | 1208-00 |
| మీరే న్యూమరాలజిస్ట్ (దావూద్) | | 370-00 |
| నిర్ణయసింధు (2భాగాలు) | | 590-00 |
| సాయి... | ,, | 45-00 |
| శ్రీ దుర్గానందలహరి | ,, | 200-00 |
| ఆరతిసాయిబాబా | ,, | 11-00 |
| ప్రతిష్ఠకల్పః(సాగి నరసింహమూర్తి) | | 500-00 |
| తాజుద్దీన్‌బాబా సచ్చరిత్ర | | 100-00 |

**సుమారు 100 సం॥రాలునాటి ప్రాచీన ప్రతులు తిరిగి ఈ క్రింది గ్రంథములు ప్రచురించబడినవి.**

| | |
|---|---|
| శ్రీరామ మంత్రానుష్ఠానము | 300-00 |
| శ్రీరామనవరాత్రోత్సవకల్పః | 300-00 |
| సీతారామ కథా సుధ అయోధ్యకాండ | 200-00 |
| సీతారామ కథా సుధ బాలకాండ | 150-00 |
| అరణ్యకాండ | 100-00 |
| శ్రాద్ధము ఎందుకు పెట్టాలి ? షోడశ సంస్కారములు | 200-00 |
| స్మార్త కాపర్ది కారికలు | 200-00 |
| నపుంసక సంజీవనము, వైద్య శిరోమణి | 200-00 |
| విషవైద్య చింతామణి | 200-00 |

| | |
|---|---|
| హేమాద్రి సూరిణా ప్రాయశ్చిత్తాధ్యాయః | 300-00 |
| సర్వమూలికా గుణరత్నాకరం | 300-00 |
| ఆపస్థంబీయ ధర్మసూత్రాలు | 300-00 |
| సర్వశాంతి దర్పణం - అపర ప్రయోగ దర్పణం | 200-00 |
| గణకరంజని | 200-00 |
| సంతాన దీపిక | 200-00 |
| తిథినిర్ణయ కాణ్డః | 250-00 |
| ముహూర్త దర్పణం | 200-00 |
| జ్యోతిష శాస్త్ర రత్నము (శ్రీపతిజాతక పద్ధతి) | 250-00 |
| లఘుతాచకము | 200-00 |
| శ్రీ వైఖనస పైతృమేదిక ప్రయోగః | 300-00 |
| స్మృతి రత్నాకరము (ధర్మశాస్త్రం) | 400-00 |
| జాతకామృతతసారం | 300-00 |
| జాతక బోధిని | 300-00 |
| సంగీత విద్యాదర్పణం | 300-00 |
| సంగీత సర్వార్థసారసంగ్రహం | 300-00 |
| ముహూర్త మార్తాండం(టీకతాత్పర్యం) | 450-00 |
| జాతకరహస్యం | 200-00 |
| రాజమార్తాండం | 200-00 |
| ఆయుర్దాయదీపిక | 200-00 |
| వైద్యామృతం | 200-00 |
| అనుపానమంజరీ | 200-00 |
| నవగ్రహశాంతి విధానం-ఉదకశాంతి విధిః | 200-00 |
| చికిత్సరత్నము | 200-00 |
| స్వరచింతామణి | 200-00 |
| ద్వాదశలోహ భస్మవిధానం | 200-00 |
| దైవజ్ఞయశో విభూషణం | 200-00 |
| అనుపాన రత్నకరము | 200-00 |
| కాలామృతము | 250-00 |
| దైవజ్ఞకర్ణామృతము | 300-00 |
| రసేంద్ర చింతామణి | 300-00 |
| రసరత్న సముచ్చయం | 300-00 |
| వస్తుగుణరత్నాకరము | 300-00 |
| హోరానుభవదర్పణము | 360-00 |
| విశ్వకర్మ ప్రకాశిక వాస్తుశాస్త్రము | 250-00 |
| స్త్రీజన కల్పవల్లి | 450-00 |
| సంగీత సర్వార్థ సంగ్రహం | 300-00 |
| సంగీత సుధాసంగ్రహము | 250-00 |
| అర్క ప్రకాశము | 200-00 |
| సంగీత మార్తాండము | 200-00 |
| సంగీత ప్రథమబోధిని | 200-00 |

